పాస్తు దైత్యేంద్ర దుఃఖితాః ప్రపలాయితాః। మమాపి జర్ఝరీభూతం వ
ర్మవ్యయఃకరినాత్మకం॥ న సహేస్మ తథోద్విగ్నప్రాణస్తత్క్రూరరణాంగణే।
కేనోపాయేన ముక్తాగ్నిర్హన్యతాం సక్రమోద్భటః॥ ఇంద్రస్యాగ్నేర్యమస్యా
ప్యపవనస్యాంబుధీశితుః। కుబేర నిర్ఋతీశానాం ప్రహారాస్సహితాః పు
రా॥ తే సర్వే చైవ ముక్తాగ్నేశ్శరాఘాతలవస్య తు। కోటికోట్యంశతోపాపిన
సామ్యం యాంతి త్రైలోక్యతః॥ తస్య వీరప్రకాండస్య ముక్తాగ్నేర్దండధారిణః।
త్వం చేత్స్వదర జానీషే వధోపాయం వదాధునా॥ ఇత్యగ్రజవచః శ్రుత్వా
ప్రాహ ప్రాజ్ఞస్సుమండలః। దైత్యేంద్ర రోచతే మహ్యముపాయః కశ్చిదుజ్జ్వ
లః॥ నివేదయిష్యే తత్తేద్య శ్రూయతాం సావధానతః। నిశీథే బలమత్యు
గ్రం రక్షసాం పిశితాశినాం॥ న తథా మానుషాణాం చ దేవానాం వా భవిష్య
తి। తస్మాదద్యైవ సన్నద్ధాః ప్రచలంతు నిశాచరాః॥ క్షణేన సంగతస్సంఖ్యే ము
క్తాగ్నిర్నిహనిష్యతే। గచ్ఛ గచ్ఛ మహాబాహో యత్ర ముక్తాగ్నిరాస్థితః। జహి
తం విహితావజ్ఞం భజ నిష్కంటకాం శ్రియం। సుమండలవచః శ్రుత్వా దైత్యేం
ద్రో జానుమండలః॥ అభినంద్య వచస్తస్య సన్నాహ్యాసురసైనికాన్। య
యౌ దృఢరథారూఢో నానాశస్త్రాస్త్రసంయుతః॥ సంశప్తకైశ్చ సంయు
క్తో వీరైర్విక్రమశాలిభిః। రథవాజిగజారూఢైర్యత్ర ముక్తేశసైనికాః॥ నిశా
చరాస్తదా సర్వే పీత్వా మైరేయమాగళం। భుక్త్వా చ పిశితం హృద్యం నవ
రాహుతురగద్విషాం॥ మహాసారబలోపేతాః పటుకంకటసంయుతాః।
సింహనాదాన్ ప్రకుర్వంతస్సంఖ్యే విక్రీడురుద్ధతాః॥ యథా రాక్షససైన్యా
నాం తాదృక్కోలాహలశ్రుతః। ముక్తేశసైన్యపతయస్సర్వే సన్నాహసం
భృతాః॥ యుద్ధాయోద్యమమాస్థాయ సన్నద్ధాస్సంప్రతస్థిరే। ఉభయే
చ తథా సైన్యాః సంగ్రామం చక్రురద్భుతం॥ రాక్షసానాం బలాటోపా
ద్భీతా ముక్తాగ్నిసైనికాః। విభ్రాంతా వ్యాకులాత్మానో వినిర్భిద్య పలాయి
తాః॥ ప్రచక్రముర్మహాఘోరాస్తాననుక్రమ్య రాక్షసాః। సుమండలస
మేతశ్చ దైత్యేంద్రో జానుమండలః॥ అనుక్రమ్యైవ తాన్ సర్వాన్ వీక్షో

ముక్తషేణసైనికాన్। ప్రజహార శరాసారైర్భీతాంశ్చ ప్రపలాయితాన్॥ తదంతరే పరాదేవీ ముక్తశేపక్షపాతినీ। ఆవిర్బభూవైవ సహసా సహస్రముఖలోచనా॥ సహస్రకరసంబద్ధ నానాశస్త్రాస్త్రసంయుతా। సంరుధ్య పదవీం దేవీభర్త్సయంతీ నిశాచరాన్॥ రాక్షసైర్మదనిర్ముక్తాన్ సంగ్రసంశితాన్ శరాన్। రరక్ష భృశవిత్రస్తాన్ సర్వాన్ ముక్తషేణసైనికాన్॥ తథాముక్తసరస్తీరే మహితాః మునిమునయః। జప్త్వా హుత్వా ప్రపూజ్యేశాన్ సన్నిషణ్ణాబ్రశీషుచ॥ ముక్తేశం తంపురస్కృత్య తత్త్వచింతాపరాయణాః। ధర్మగోష్ఠీసమాసక్తాః కృత్వాపుణ్యాకథాశ్శుభాః॥ నిశీథేసమనుప్రాప్తే శశాంకేవ్యోమమధ్యగే। నిశ్శబ్దేభువనే సర్వే శయితుంతేసముత్సుకాః॥ పర్ణానాం సంస్తరేష్వేవ కుశకింజల్కకాశిషు। వపూంషిస్వానిసంయమ్య నిద్రామాకాంక్ష్య శిశ్యిరే॥ తదంతరే మహాఘోషో రాక్షసానాం ప్రతస్థుషాం, భువనోద్భేదనస్సోయమశ్రూయతసుదారుణః॥ శ్రుత్వైవతంమహాఘోషం ముక్తషేణర్వ్యక్రమోత్సుకః, వ్యజ్ఞాపయన్మహాప్రాజ్ఞః ప్రణమ్య మునిపుంగవాన్॥ ఆర్యానిశామయధ్వంమే విజ్ఞాపనముదీర్యతే, శ్రూయతే సుమహాఘోషః క్రవ్యాదానాంసుదారుణః॥ నిశీథేస్మిన్ నసందేహో రాక్షసాయోద్ధుమాగతాః, రక్షసామర్ధరాత్రేషు బలంహిసుమహత్తరం॥ సైనికానస్మదీయాంస్తే సాదయేయుస్సుదారుణాః। తస్మాదద్యగమిష్యామి సంయోద్ధుంపిశితాశనైః॥ భవంతస్సుఖితాస్సంతశ్శేరతాం పర్ణసంస్తరే। సంప్రేక్ష్యోద్యంతమాదిత్యం హత్వాతంజానుమండలం॥ పునఃపాదసమీపంవస్సన్నిధాస్యామి శీఘ్రతః। అనుజ్ఞాప్యత రోమాన్హైర్యస్సంయోద్ధుం తేనరక్షసా॥ ఇతితస్య వచఃశ్రుత్వా వసిష్ఠాత్రిపురోగమాః। స్వస్తితేస్తు జయస్తేస్తు జహిశత్రుం దురాసదం॥ గచ్ఛత్వం పునరాగచ్ఛ జయలక్ష్మ్యాసమేయివాన్, శివాస్తే సంతుపంథానస్సాధయత్వమరిందమ॥ వయమత్ర శయిష్యామస్త్వదాగమనకాంక్షిణః। ఇతితేషాంవచఃశ్రుత్వా రథమారుహ్య వేగవాన్॥ జగామ తంసాజి

ష్ణుశ్శశిచ్యుతిశితేపథి। దదర్శ తత్రముక్తేశః పలాయ్య ప్రజతోబహూన్ ॥
ముక్తశస్త్రాన్ మహావీరాన్ తత్రస్వస్యైవసైనికాన్। తానువాచమహా
బాహుః పలాయనపరాన్జనాన్ ॥ కేయూయంవా కిమిత్యేవం కాందిశీ
కాః కృతాశ్చకైః। సర్వేయూయంమహావీరామహాబాహూన్నతవపుర్ధృతః॥
శస్త్రాస్త్రధృతినిష్ణాతా స్సర్వేసంనద్ధవిక్రమాః। తేచతద్వచనం శ్రుత్వా
సర్వేచనిశితాపితాః॥ వ్యబ్రువన్విభ్రమగ్రస్తాః పరిభ్రాంతాంతరంగకాః।
వయం ముక్తేశసాహాయ్యే నిమిషాంబానియోజితాః॥ జానుమండలవా
మానంరాక్షసంహంతుముద్యతాః। తథాపితైర్మహాగ్రాస్త్రైః పరుషైః
పిశితాశనైః॥ వేపితాస్తాడితాశ్చైవ నిశీథే దృఢవిక్రమైః। ముక్తేశస్తు మ
హావీరః క్వాపిసంప్రయయౌబలీ॥ తమన్వేష్టుంప్రయామోఽస్య క్రవ్యాద్భి
రనుధావితాః। యదిత్వం ననుజానీషేముక్తర్షింగణకోవిదం॥ తన్నః ప్ర
చక్ష్వభద్రంతే తత్రగచ్ఛామహేవయం। ఇతితేషాం వచశ్శ్రుత్వా ప్రా
హముక్తర్షిరాత్మవాన్॥ మాభైష్టవీరాభద్రంవో మాపలాయధ్వమంజ
సా। ముక్తర్షిరస్మ్యహంసాక్షాత్ యమన్విష్యథ సర్వథా। పశ్యోహమథ
మాగ్వీకం దారుణం ధనురధ్వహన్। దానవాన్ శాతయేతూర్ణం జాను
మండలపాక్షికాన్॥ అద్యసూర్యోదయాత్పూర్వం హత్వాతంజానుమం
డలం। శ్రమంవోవ్యపనేష్యామి పురాశేశ్మసంయథా॥ ఇతిముక్తర్షివ
చనం శ్రుత్వాతేభయవర్జితాః। సైనికాస్సాధనోపేతాస్సమావర్తంత సం
యుగం దదృశుస్తత్ర తిష్ఠంతీం సహస్రముఖలోచనాం॥ నానాయుధగ
ణోపేతాం నానాసంఖ్యకరాంబుజాం। నానాభరణసాహస్రైర్దివ్యమా
నాం సుఖాస్వతీం॥ రాక్షసైర్మచ్యమానాంశ్చ నారాచానగతీంహతాత్
హుంకారేణైవతాన్సర్వాన్మూర్ఛితాన్ పరికుర్వతీం। త్రాయంతీ సైని
కాన్ భీతాన్ ముక్తర్షేర్మహితాత్మకాం॥ తాందృష్ట్వా నిమిషాందేవీంహృ
ష్టాత్మామహాక్తీకోమునిః। తుష్టావమధురైర్వాక్యైః శ్లాఘైస్తత్త్వార్థదర్శిభిః
నమస్తేదేవమహితే నమస్తేభువనేశ్వరి। నమస్తేసర్వకళ్యాణి నమస్తేలో

కపావని॥ త్వయైవపరిపాల్యంతే భువనానిచతుర్దశ। త్వమాదిఃసర్వభూ
తానాం త్వంశక్తిఃపరమేష్ఠినః॥ త్వయాఽనానతిష్ఠంతి స్థావరాణిచరా
ణిచ। ప్రసీద దేవికల్యాణి కిమర్థమిహతిష్ఠసి॥ త్వయైవయది హన్యంతే
సాక్షాద్రాక్షససైనికాః। కాప్రతిష్ఠాభవేద్దేవి భక్తానాంతవతద్ధుషాం॥ అ
నుగృహ్ణీష్వనోదేవివయంహన్యామహేయతః। శత్రూన్ఘాతయాస్మా
భిస్సోయమస్మాస్వనుగ్రహః॥ సుశాంతంసుకుమారంతే రూపంసంప్రతిద
ర్శయ। ఇతిముక్తర్షివచనం శ్రుత్వాసానిమిషాంబికా॥ వత్స తేసంప్రసన్నా
స్మినాహంహన్యాంతవద్విషః। త్వయైవ ఘాతయిష్యామి సంగ్రామేనాస్తి
సంశయః॥ జయంతం త్వాం ద్విషోశేషానుత్సాహోల్లాసభాసురం।
స్తూయమానం సురైస్సర్వైర్వీరశబ్దాభిభూషితం॥ త్వాం వత్సద్రష్టుమి
చ్ఛామి శంకరస్యప్రియంసుతం। విజయస్వరిపుంవత్స మామాశిష్టానిశీథినీ॥
రాక్షసోత్సాహకాలస్తు గతఏవనసంశయః। అహమంతరతస్థిత్వాసర్వాన్
వఃపరిపాలయే॥ యుధ్యస్వ పరమోత్సాహ స్నేహనిష్యసి రాక్షసాన్।
ఇత్యుక్త్వాంతర్దధేదేవీ మహిషాసురమర్దిని॥ వర్ధయన్నథముక్తేశో రణో
త్సాహంచమూంసదాం। జగామతరసావీరో యత్రాస్తేజానుమండలః॥
గాత్రేశిష్టేతదాయామే సమేతోభయసైనికాః। మహోత్సాహాస్స
సంరబ్ధా వ్యవధుస్సాంపరాయకం॥ ఉభయేష్వపివీరేషు ప్రహరత్సుపరస్ప
రం। గర్జత్సుచ మహాఘోరం విచ్ఛిన్నేషుచ సర్వశః॥ జానుమాన్రాక్ష
సోభీమః ప్రాప్తంముక్తర్షిమున్ముఖః। తామ్రాక్షశ్చ శరాన్శీఘ్రం హస్తే
నోత్పాట్యతూణతః॥ సంధాయాధికవేగేన ప్రజహారమహాబలః। గ్రంథి
కృత్య భ్రువౌదైత్యః కంకపత్రవిభాసురాన్॥ స్వర్ణపుంఖాంశ్చ హస్తేన
ధృత్వాసంప్రజహారసః। కృత్వా మహాజ్యావాదం ధనుష్యాయోజ్య
సాయకాన్॥ ప్రజహారమహాబాహుర్ముక్తర్షింనిశితైశ్శరైః। నిమిషాం
శామనుస్మృత్య నిశాంతసమయేవశీ। ఆకర్ణాకృష్టకోదండ స్సంధాయ ప
రుషాన్శరాన్॥ ప్రయుక్తవాన్ జానుమంతం మునీంద్రస్సంపరిస్ఫురన్।

తదంతరేమహాయోగీ చిత్రయుద్ధవిచక్షణః। దివ్యప్రభావం స్వధను స్తథా ధృత్వా సువీక్షణః॥ సహసా సస్వర్ణపుంఖమాశుగం విజయావహం। గుణధ్వనింకారయిత్వా ముమోచాస్త్రం సుదారుణం॥ తేనాస్త్రేణాతి ఘోరేణ జ్వాలాభీలతరార్చిషా। రయాత్పాతితవీరేణ తీవ్రేణభయకారిణా॥ బలముత్పాదితంసర్వం రాక్షసానాంసమంతతః। సుమండల స్తదా క్రుద్ధో నిబధ్యభ్రూకుటింముఖే॥ దంతాన్ పటపటాకుర్వన్ దంశయన్నివ విద్విషః। సజ్యంకృత్వా ధనుర్ఘోరం సంధాయనిశితాన్శరాన్॥ ముమోచాభిముఖేతిష్ఠన్నిష్ఠురాత్మా సువీక్షణే। తాం స్తదా పరుషాన్బాణాన్నివార్యవిశిఖైశ్శితైః॥ వవర్ష బాణజాలాని వర్ష ధారాఇవాంబుదాః। పునశ్చవ్యక్షిపద్దైత్యః పునశ్చాసౌసువీక్షణః॥ సతతో దైత్యదైవత్యమస్త్రమామంత్ర్యశస్త్రవిత్। సువీక్షణమభిదృత్య ప్రముమోచ సుదారుణం॥ తదస్త్రమాపతత్తీవ్రం ఘోరాకారాన్ప్రదర్శయత్। కుర్వచ్చ దారుణాన్ శబ్దాన్ సర్వానపివిమోహయత్॥ సుమండలకరోన్ముక్తమభివీక్ష్య సువీక్షణః। అమోఘమస్త్రమామంత్ర్య వైష్ణవంపరమాద్భుతం॥ రాక్షసస్యాస్త్రముత్యుగ్రం లీలయైవబభంజహ। అథక్రుద్ధశ్చదైత్యేంద్రో విక్రమీచసుమండలః॥ ముమోచాగ్నేయమస్త్రంతజ్జ్వాలావ్యాప్తదిగంతరం। సువీక్షణః ప్రయుజ్యైవ వారుణాస్త్రం సుదారుణం॥ శమయామాససహసారాక్షసస్యాస్త్రముజ్జ్వలం। పన్నగాస్త్రం ససర్జాథ ప్రచండాత్మాసుమండలః॥ తదాపతచ్చాభివీక్ష్య ఫూత్కారాన్ విదధత్కృతీ। సువీక్షణః ప్రయుయుజేగారుడాస్త్రం సుమంత్రవిత్॥ తచ్చపక్షసముత్క్షేపాత్పాతయన్నఖిలాంచమూం। ఉచిక్షేప క్షణార్ధేన రాక్షసోన్ముక్తపన్నగాన్॥ సుమండలోథసంక్రుద్ధో గాంధర్వం ససృజేశరం। సమ్మోహనం మహావేగం లీలయాంచత్సువీక్షణః॥ తతశ్చ పరమక్రుద్ధః శరాసారం సుమండలః। సర్జమేసుమహాఘోరమసంఖ్యేయం మహాద్భుతం॥ తాన్ లీలయైవసంఛి

దృష్ట్వైవ చక్షుణ్యాత్పువీక్షణః। అమోఘమస్త్రమామంత్ర్య బ్రాహ్మం పరమ
దారుణం॥ ప్రయుజ్య తత్క్షణాదేవ పాతయామాస రాక్షసం। పాతి
తోమూర్ఛితోభూత్వా మృతప్రాయస్సుమండలః॥ యామమాత్రంహి శే
తేస్మ నిశ్వాసపరివర్జితః। సుమండలే మహావీరే పతితే రణమూర్ధని॥ అత్ర
స్వనోల్బణాస్సర్వే జానుమండలసైనికాః। పలాయాంచక్రురుద్విగ్నాహ
తశేషాస్తు కేచన॥ అథరాక్షసరాజేంద్రో బలవాన్ జానుమండలః। స
న్నాహ్య తరసా సైన్యాన్ సముత్సాహ్య సమంతతః॥ సాయకైశ్ఛాద
యామాస సర్వాన్ ముక్తర్షిసైనికాన్। కేతనాన్ ఖండయామాస చిచ్ఛే
దరథకూబరాన్॥ నిర్బిభేద సకుంభాంశ్చ హయమస్త్రాన్యదారయత్। బ
భంజకంకటాన్వీరో వీరాణాంపరుషాత్మనాం॥ శస్త్రైఃప్రచ్ఛాదయామాస
రణరంగంసమంతతః। తస్యసంరంభముద్వీక్ష్య ముక్తేశస్సజ్యకార్ముకః॥ ని
వార్యసహసా బాణాన్ స్వబాణైశ్శీఘ్రగామిభిః। అసంఖ్యేయాన్ శరా
సారాన్ రిపుభ్యః ప్రజిఘాయసః॥ తైశ్చముక్తేశనిర్ముక్తైః పృషత్కైఃపరు
షైశ్శితైః। సంఘశశ్చ వ్యదీర్యంత గజకుంభాఃసహస్రశః॥ ఏకైకసాయ
కస్తత్ర ముక్తోముక్తర్షిణాతదా। భిందన్నభిముఖీభూతాన్ మహావీరాన్
పరశ్శతం॥ యోజనం యోజనం గత్వా వేగవైచిత్ర్యమావిశత్। విచ్ఛి
న్నాంగాస్తురంగాశ్చ పాదాంతం పంచతాంగతం॥ శతాంగాః శతశో
భగ్నాః సర్వముద్వేజితంబలం। హతశేషాశ్చయే కేచిద్రాక్షసాదిక్షుధా
వితాః॥ అథసోభిముఖీభూయ ముక్తర్షిరమితప్రభః। జానుమండలముద్వీ
క్ష్యధనుర్జ్యాంప్రతినాదయన్॥ ఉవాచవాక్యమేకంతు గంభీరకఠినాక్షరం
జానుమండలదుర్బుద్ధే గతాస్తేబహవోభటాః॥ సేనాధ్యక్షాఅపిమృతాః
సర్వముత్సాదితంబలం। సహోదరోపి తేవీరశ్శాయితోరణమూర్ధని॥ హ
తశేషైఃకతిపయైర్జీవిత్వా శరదాంశతం। పుత్రైర్మిత్రైః కలత్రైశ్చ సుఖే
నవసనిశ్చితం॥ శంకరం శరణంగచ్ఛ తథాచేన్నిహన్మ్యహం। అన్యథా

శరజాలేన వ్యసుం త్వాం మద్య కారయే ॥ యద్యైవ రోచతే తుభ్యం తథా త్వ
మనుశిక్షభోః। ఇత్యుక్తః పరుషం తేన గర్జయన్ ఘననిష్ఠురం ॥ ఉవాచ కీ
తికుశలో రాక్షసో జానుమండలః। నశంకరో నవా విష్ణుర్నత్వం న త్రిదశా
లయాః ॥ జీవంత్యభిముఖీభూయ రణరంగే న సంశయః। అద్య త్వాం నిహ
నిష్యామి శంకరేణాపి సంయుతం ॥ విష్ణునా సహితం వాపి దేవైర్వా త్రిది
వాలయైః। ధిక్త్వాం మాక్తిక మర్భ్యద్దే మాద్యాన్ ప్రలపసే బహు ॥ ఇత్యుక్త్వా
పరుషాన్ బాణాన్ ముమోచ దృఢవిక్రమః। తాన్ శరాన్ స్వశరైశ్ఛిత్వా
లఘుహస్తస్తు మాక్తికః ॥ బాణాన్ బహూన్ విచిక్షేప పరుషాన్ మర్మభేది
నః। తాన్ శరాన్ జానుమాంస్తస్య ఛిత్వాన్యాన్పునరక్షిపత్ ॥ చాపేని
యోజ్య సద్బాణాన్ ప్రాయుఙ్త సవిలక్షణః। తైరేవ పరుషైస్త్రివైర్ముక్తై
రాకృష్య యత్నతః ॥ సదదార తదా భిత్వా ప్రవిశ్యాసురవక్షసి। జాను
మాన్ దారితోరస్కస్తీవ్రక్రోధాధిసంప్లుతః ॥ ముమోచ విశిఖాన్ స్తీవ్రాన్
ముక్తేశప్రజిఘాంసయా। తాన్ క్షణాదేవ చిక్షేప వీర్యవాన్ ముక్తపుంగ
వః ॥ పునరాదాయ తూణీరాదాశుగాంస్తత్ర రాక్షసః। ప్రయుక్తవాన్ వి
షజ్వాలాన్వమన్ సర్పగణానివ ॥ సప్త బాణాన్ సువేగేన చిచ్ఛేద స సు
లక్షణః। శిలీముఖేనచైకేన సహస్రోద్భేదకారిణా ॥ తతశ్చ రాక్షసోసూ
యుస్తీవ్రక్రోధసమన్వితః। సువీక్షణం మాక్తికం చ సర్వానుద్దిశ్య సైనికాన్
శరౌఘాన్సుబహూన్వీర స్ససర్జ ప్రధనోద్భటః। బాణాసనే చ ద్వౌ బాణౌ
సంయుజ్యాథ సువీక్షణః ॥ ప్రయుక్తవాన్ రాక్షసేంద్రం తావుభౌ సంప్రవి
శ్యతం। ఏకో బిభేద తస్యాక్షు స్తదాన్యశ్చాపమచ్ఛినత్ ॥ చాపమన్యం సమా
దాయ జానుమాన్ ఘోరవిక్రమః। సర్వమాచ్ఛాదయామాస బలం ము
క్తమునీశ్వరైః ॥ తస్యేశం విక్రమం వీక్ష్య విస్మిత్యా పృతనాధిపాః। సర్వేచై
వసుసంరబ్ధా సర్వే చాధిజ్యకార్ముకాః ॥ హతశేషాంస్తదా సైన్యాన్ జాను
మండలరక్షసః। నిష్పిష్య దారయిత్వా చ నిన్యే రంగం శ్మశానతాం ॥

అప్పసంఖ్యాస్తుదైతేయాః పలాయాంచక్రిరేభయాత్ । ఏకాకీ సమహావీరో రాక్షసోజానుమండలః ॥ విక్రమంసుమహచ్చక్రే లోకానామద్భుతోపమం । ముక్తేశసైనికానాంచ జానుమండలరక్షసః ॥ సంప్రహారో మహానాసీత్తూష్ణీంముక్తషీణరాస్థితః । ఏతస్మిన్నంతరే దైత్యైర్హతశేషైః పలాయితైః ॥ వీరాస్సంశప్తకానామ వృత్తాంతం వినివేదితాః । సద్యస్సనురసన్నద్ధానానాశస్త్రాస్త్రపాణయః ॥సమాగత్యాహవం చక్రుస్సమవేత్యరణేబలైః । సంశప్తకానాం సైన్యానాం ముక్తసేనాసదామపి ॥ బభూవాయోధనంభీమం సర్వేషాంరోమహర్షణం । యుధ్యమానేషు సైన్యేషు తథాతత్రోభయేష్వపి ॥ ముక్తేశజానుమంతౌ తావుపచక్రమతూరణం । ముహూర్తమాత్రంతౌవీరౌ విసృజంతౌ శరోత్కరాన్ ॥ చిక్రీడతూరణే ఘోరేరేప్రహరంతౌ పరస్పరం । ఏతస్మిన్నంతరే దేవో ద్వాదశాత్మా సుమహామహాః ॥ దిదృక్షురేవసౌరంభం జానుముక్తేశయోః । ఉదయాచలమారుహ్య పశ్యతీవోత్పలోచనైః ॥ జానుమద్వ్యూహముద్భావ్య వదనాని యథానణాం । పద్మాకరేషు పద్మాని ప్రస్మేరాణ్యుల్లలాసిరే ॥ జహి శత్రుంమరాత్మానమితీవగదితుంశనైః । వవౌప్రాభాతికోవాతో మందంముక్తేశసన్నిధౌ ॥ తదానీం మార్క్తికోమానిస్సంస్మృత్య మునిసత్తమాన్ । శంభుమంబాంనిమేషాంచ భక్త్యాభిధ్యాయ మానసే ॥ ప్రణమ్యాప్యంతమాదిత్యం జానుమండజిఘాంసయా । జఘానసపరుషైర్బాణైః కంకపత్రాభిభూషితైః ॥ తైర్విద్ధోపి బలీదైత్యో జానుమాన్ క్రుద్ధమానసః । రక్తాభిసంప్లుతైర్గాత్రైః క్రోధసంరక్తలోచనః ॥ మార్క్తికంమునిమాలక్ష్య అష్టకాసక్తహస్తయుక్ । ధనురాకర్ణమాకృష్య ముమోచ నిశితాన్ శరాన్ ॥ తాన్ శరాన్ క్షణశః ఛిత్వా ముక్తేశోరోషభూషితః । స్వవేగాటోప వేగేన శరాన్ సంధాయ కార్ముకే ॥ స్యందనం ఖండయామాస సూదయామాస సారథిం । రథ్యాంశ్చ ఛేదయామాస జానుమంత మమూర్ఛయత్ ॥ మూర్ఛాక్రాంతః క్షణార్ధేన పపాతభువి రాక్షసః । ఉత్థస్థవాం స్తదాశీ

క్షణం ప్రవివేశనభ స్తదా ॥ బాణానన్యాన్ ససంగృహ్య తస్యోపరినిశాచ
రః, శరాసనే తాన్ సంధాయ సహసైవ ప్రముక్తవాన్ ॥ ముక్తర్థిస్తాన్
పునశ్ఛిత్వా బహూంశ్చిక్షేప సాయకాన్। తైరావృత స్తతస్సోపి తాం
శ్ఛిత్వానిశితైశ్శరైః॥ సర్వత్ర ఛిందయామాస కంకపత్రైర్మహాజ్వ
లైః। తదంతరే మహాయోగీ మౌక్తికో మునిసత్తమః॥ ఇంద్రమాగ్నేయ
మాదిత్యమస్త్రం వాయవ్యముత్తమం, గాంధర్వమృభుదైవత్యం వారు
ణం గారుడంమహత్ ॥ వైష్ణవంవసుదైవత్యంనానాస్త్రాణిప్రయుక్తవాన్
తాన్యస్త్రాణి మహావీరః ప్రత్యస్త్రైర్వినివారయన్ ॥ బహూన్యస్త్రాణిచి
క్షేప బిభేదైత్యాని మౌక్తికః। అనంతరం మహాయోగీ మౌక్తికోముని
సత్తమః॥ స్మృత్వా సదాశివందేవం ధ్యాత్వాచనిమిషాంబికాం, సర్వా
న్దేవాననుస్మృత్య బ్రహ్మవిష్ణుపురోగమాన్ ॥ మహర్షీంశ్చ నమస్కృత్య
మంత్రద్రష్టౄన్మహామహాన్। సమ్మంత్ర్య రుద్రగాయత్ర్యా సుసమాహి
తచేతనః॥ అస్త్రం పాశుపతంనామ ముక్తవాన్ జానుమండలే, జ్వా
లావ్యాప్తదిగంతేన రంహసా చాలితాద్రిణా ॥ భూమికంపంజనయతా
సముత్క్షోభితవార్ధినా। పాతితోడుసహస్రేణ నాదైః కర్ణవిదారిణా ॥
ఉన్మూలితమహీజేన విద్రావితపలాశినా। ఘోరరూపోబలోదగ్రో జాను
మండలరాక్షసః॥ విక్షతః పరుషం మస్తే శంఖం క్రోదయతాహతాత్ ,
అస్త్రేణతేన విహతఃపంచత్వం ప్రత్యపద్యత ॥ తదస్త్రం మౌక్తికోన్ముక్తం
హత్వాతంజానుమండలం, శేషాన్ నిశ్శేషయామాస జానుమతేర్నా
చరాన్ ॥ పునశ్చ శాంతవేగంసత్ మౌక్తికంసంన్యదాత్తథా। ద్విత్రాః
పలాయితాదైత్యా నగరం సురకంటకం॥ గత్వా నివేదయాంచక్రుః శు
ద్ధాంతే వృత్తమీదృశం। తతోదేవగణాస్సర్వే జగుస్సంతోషభాసురాః ॥
పుష్పవర్షం కారయిత్వాదివ్యమందుభినిస్వనం। భూతప్రేతపిశాచాశ్చ శా
కినీఢాకినీగణాః॥ రణభూమిం సమాసాద్య మాంసమస్తిష్కపూరితాం।

రక్తనిర్ఝరిణీశ్చైవ తాలదఘ్నాః సముద్రగాః ॥ సంతృప్తచేతసస్సర్వే తు ష్టువుర్మార్కకంమునిం । అథమార్కికమునీంద్రో నివర్త్యగథముత్తమం ॥ జగామతరసావీరః స్థితాయత్రమహర్షయః । రథేనాప్రతిమేనాథ రూపేణ జితకాశినా ॥ మునీనాం దేవతానాంచ సుఖంకారయతిస్స్వయం । సంతుష్టోమార్కికశ్చాథ సర్వైర్మునిగణైస్సహ ॥ కాల్యకృత్యాని నిర్వర్త్య జజాప పరమంజపం ॥ ఇత్థంనిహత్య సురకంటకమాశరేంద్రం ముక్తేశ్వరః పశుపతేస్సుమహాస్త్రయోగాత్ । సంగమ్య కోమలసరోవరతీరసంస్థానోగీశ్వరాః లలితభామణతత్పరోభూత్ ॥

ఇతి శ్రీ బ్రహ్మాండపురాణే బ్రహ్మనారదసంవాదే వర్ణవైభవ ప్రస్తావే మార్కికోపాఖ్యానే జానుమండలవధోనామ త్రయోదశోధ్యాయః శ్రీ శ్రీ



శ్రీరస్తు.

కల్యాణంభూయాత్.

# శ్రీ బ్రహ్మాండపురాణే వర్ణవైభవ
## ఖండే ముక్తమ్యుపాఖ్యానే
## చతుర్దశోధ్యాయః.

నారదఉవాచ ॥ పద్మాసననమస్తేస్తు ప్రబ్రూహి మమసాంప్రతం। ముక్తేశో విదధేకింవా నిహతేజానుమండలే ॥ కాతస్యపత్నీకల్యాణీ కేపుత్రాః కీదృశీస్థితిః। వంశశ్చ కీదృశస్తస్య కులవృత్తిశ్చకీదృశీ ॥ ఏతత్సర్వంవివిచ్యాహం శ్రోతుమిచ్ఛామిహేపితః ॥

*బ్రహ్మోవాచ*

శృణునారదవక్ష్యామి తస్యవృత్తమశేషతః ॥ నిహతేసుమహావీరే రాక్షసే జానుమండలే, భృత్యైర్నివేదితోదంతా జానుమండలభామిని ॥ శోభితాంగీసుదుఃఖార్తా దుస్సహాదీర్ఘవేదనా। యుద్ధభూమిమనుప్రాప్య యత్రజానుమతశ్శవః ॥ దృష్ట్వైవకుణపం స్థూలం విస్ఫురద్రత్నకుండలం మస్నిగ్ధగండమున్నాసం సంత్రోటితకరోటికం ॥ రక్తధారాభిషిక్తాంగంజర్ఝరీభూతకంకటం। పతితం పాంశుజాలేషు శోచనీయాం దశాంగతం ॥ ముమూర్ఛ సహసానారీ ముహూర్తంగతచేతనా। శోకమోహపరిక్లిష్టా విలలాపాకులేంద్రియా ॥ హానాథ హామహావీర హాశూర త్రిదశాంతక। హారాక్షసకులాధ్యక్షహాత్రిలోకభయంకర ॥ అంతఃపురోచితాంకాంతాం తవపత్నీం మనస్వినీం। క్షమసే కిం మహావీర రణభూమిముపాగతాం ॥

యస్త్వం మామాలోకమాత్రేణ గృహీత్వా ప్రతిభాషసే । బుధ్యసే నాద్య కిం నాథ
విలపన్తీం త్వదంతికే ॥ రచితం విప్రియం నాథ రహస్యేష్వపి న క్వచిత్ ।
మయా తుభ్యం త్వయా మహ్యం కిమకస్మాత్ప్రతికుప్యసి ॥ బాలే సమీహి
తం కింతే బ్రూహి కిం కరవాణ్యహం । ఇత్థం ప్రణయకోపేషు ముహు
ర్మాం యోఽనుభాషసే ॥ తాదృశస్త్వం నిపత్యైవం విలపన్తీం సుదుఃఖితాం
అనాథవద్విలుఠితాం భువి సాంత్వయసే న కిం ॥ కిం మయా రచితం నాథ
తవ కోపస్య కారణం । యత్త్వం నాలోకయస్యేవం విలపంతీం త్వదంతికే ॥
గమిష్యన్నపి కార్యార్థం క్వచిద్దేశాంతరం పునః । పునరాగమనే చాహ్నాం
సంఖ్యాం సందోహ్యభాషసే ॥ కథం పునః ప్రవాసాయ పరలోకేఽపి సాహ
సం । కరోషి మదపుణ్యేన కఠినం హంత దైవతం ॥ త్వామీదృశం విలోక్యాపి
శతధా యన్న దీర్యతే । మత్వా పేన సుసంబద్ధం కఠినం హత జీవితం ॥ య
స్త్వం లాలయసే నిత్యం వివిధైశ్చ ప్రలోభనైః । హిత్వా జీవామి నియతం
కఠినా హంత యోషితః ॥ సత్యం మజ్జీవితం బ్రహ్మా కృతవానయసా ధవా । వ
జ్రేణ శిలయా వాపి యదిదానీం న దీర్యతే ॥ హా విధే కృతకృత్యోఽసి యస్త్వ
మద్విప్రయత్నతః । ప్రాణేశేన వినా కృత్య జీవంతీం మాం హనిష్యతి ॥ అహో
దేవాస్సగంధర్వాస్సయక్షోరగపన్నగాః । సర్వే చ కృతకృత్యాస్థ దృ
ష్ట్వా మాం విధినాహతాం ॥ అహో మార్తికమానీంద్ర కిం త్వయాలబ్ధ
మంజసా । భర్త్రా వినా కృతాం కృత్వా మామనాథాం చ దుఃఖితాం ॥
యాహం సదాసురస్త్రీభిః సేవమానాభిరంచితా । నిత్యకళ్యాణమహి
తా సుఖేనన్యవసం చిరం ॥ సా సహిష్యే కథం దుఃఖం నవవైధవ్యసంభవం ।
ప్రాక్తనస్య హి పాపస్య న జానామీదృశం ఫలం ॥ యద్దశాం గమితా హీ
నాం తాదృశాద్విభవాత్ క్షణాత్ । హా నాథ హా మహావీర సర్వలోకభ
యంకర ॥ న తే న్యాయ్యమిదం కర్మ హిత్వా మామేవ మవ్రజః । మమ పాణి
గ్రహం భర్తరకరోదగ్నిసాక్షికం ॥ నైనాం ధర్మార్థకామేషు నాతిచేత్స్యే ఇ
తి ధ్రువం । కో ధర్మోఽయం మనాలోచ్య ధర్మపత్నీ మన్యయా సహ ॥ పరలోకి

ప్రవాసోయమకాండే పిహితస్త్వయా। త్వయారచితపూర్వాణి కేళీని వసనాంతరే॥ నానామిథునకృత్యాని విఫలానికృతానివై। క్రీడాశైలాంతరాళేషు గహ్వరేషువినోదను॥ గూఢక్రియాప్రచారోమే నావృత్తింపునరేష్యతి। ప్రదీపఇవ మన్నాదే విప్రకృష్టే విధేర్బలాత్ ॥ అంధకారావృతమిదం జగత్సర్వం నభాతిమే। అస్థిరైర్విభవైస్సర్వైర్విపరీతమిదంజగత్॥ యద్భావ్యతే చిరంభూస్తు తన్నష్టంభవతిక్షణాత్। సర్వస్మిన్నపి లోకేస్మిన్ క్షుద్రాత్ క్షుద్రతరంపరం॥ గర్హణీయంచయద్వస్తు కామిన్యేవన సంశయః। కింకరోమి క్వగచ్ఛామి నిపతిష్యామి కుత్రవా॥ గర్హణీయంచ కఠినం కథంత్యక్ష్యామి జీవితం। ఇత్యేవం విలపన్తీసా శోభితాంగీ యశస్వినీ॥ లుఠంతీ భూతలేకాంతా పాంసుభిర్ధూసరాలకా। జఘాన తరసా వక్షస్తనసంబాధమాతురా॥ తాంతథా విలుంఠంతీం చక్రందంతీం కురంగీమివ। నశశాక సమాధాతుం జ్ఞాతిరేకోపి సాంత్వనాత్॥ నిశ్చేష్టాశ్చ విషణ్ణాశ్చ దీనారాత్రుసబాంధవాః। మూకాఇవ పరిత్రస్తా నాశ్వసంతిస్మ కేచన॥ అథముక్తర్షిరాత్మజ్ఞో ధర్మజ్ఞో ధర్మవత్సలః। కాల్యకృత్యం సమాప్యాశు మునిభిస్సముపేయివాన్॥ ఆజగామ పునస్తత్ర యత్రాస్తే జానుమత్రప్రియా। తంద్రుష్ట్వా భర్తృహంతారం మహర్షిసహితంమునిం॥ క్రందంతీవ్యలుఠద్భూమౌ శోకవ్యాకులచేతనా। తాంవీక్ష్య మౌక్తికోమౌనిర్దయార్ద్రహృదయస్స్వయం॥ ఆశ్వాసయన్నువాచైవం దుఃఖితాంజానుమత్రప్రియాం। సమాశ్వసిహి నారిత్వం వీరపత్నీ యశస్వినీ॥ పురుషాణాం హివీరాణాం జయోవాపజయోపివా। ఆకాలికాప్రవర్తేత నాత్రచింతా విధీయతాం॥ తవ భర్తామహాక్రూరో జఘాన తరసాబహూన్। త్రైలోక్యమభిచక్రామ బలేన విభవేనచ॥ నహిస్యాద్దైహికీసంపత్కస్యచిచ్ఛాశ్వతీస్థితా। హిరణ్యకశిపుశ్చైవరావణశ్చమహాబలః॥ బలిశ్చ త్రిదివద్వేషీవృత్రః పరమదారుణః। మధుశ్చకైటభశ్చైవ కాలనేమిసురాంతకః॥ బహ.

వో రాక్షసాః పూర్వం బాహువీర్యసమన్వితాః। మృత్యుమార్గం మహాభీ
మాస్సర్వే రాక్షసపుంగవాః॥ అలం రుదిత్వా క్రవ్యాదే కార్యే ప్రతిగతే
సతి। సంప్రత్యసురవీరస్య క్రియతాముత్తరక్రియాః॥ తవపుత్రస్య బాల
స్య ప్రదత్తం పితృమండలం। రక్షసాం హతశేషాణామాధిపత్యం వ్రజత్వసౌ
భర్తా తే ప్రగతస్స్వర్గం పుత్రో రాక్షసనాయకః॥ తేన మోదేన తిష్ఠత్వం
మా చ శోకే మనః కృథాః॥ వ్రజామ వయమీశస్య శంకరస్యాలయం ప్రతి।
ఇత్యుక్త్వా మునిభిస్సార్ధం ముక్తర్షిః ప్రయయౌ సుధీః॥ విశ్వామిత్రాశ్ర
మం పుణ్యం యత్ర యాగః ప్రవర్తితః। తమన్వయుర్గణాస్సర్వే శ్రాంతయో
సత్యసంగరే॥ తస్మిన్నృష్యాశ్రమే పుణ్యే సర్వైరేతైస్సమన్వితః। ముని
నాం దీర్ఘతపసాం ద్రష్టుమాపతతాం తదా॥ వేదోక్తాభిరమోఘాభిరాశీర్భి
రభినందితః। అగ్నిమారాధయన్నిత్యం యత్ర పాశుపతం కృతం॥ సంలాప
యన్మహర్షీంశ్చ సర్వతత్త్వార్థవేదినః। నినాయ కతిచిన్మాసాన్ సర్వ
సంతోషసంభృతాన్॥ కౌశికస్యాశ్రమం రమ్యమలంకృత్యయతవ్రతాః।
వనాంతరాగతా నైకే ముక్తర్షేస్సందిదృక్షయా॥ బ్రహ్మర్షయస్సుబహవో
వ్యధుర్వాసం సుబోధితాః॥ మాక్తికో మందపాలశ్చ సువీక్షణవిచక్షణౌ।
లక్షణజ్ఞో మహావీరో ముక్తసేనాధినాయకాః॥ సపత్నీకాశ్చ గంధర్వా
సిద్ధవిద్యాధరాదయః। హేమాగ్నిప్రభవాశ్చాన్యే రథాశ్వసుభటాద
యః॥ సర్వే సంతోషసంయుక్తాస్సుఖమూషుస్తదాశ్రమే। తదా సర్వజగ
న్మాతః ప్రససాద పరాంబికా॥ తాం ప్రణేముస్తదా సర్వే విధాయ నిట
లాంజలీన్। మాక్తికశ్చ మహానందాద్భవం దేవనతాననః॥ తం ప్రత్యాహ
మహాదేవీ నిమిషాంబా మనస్వినీ। వత్స తే సుప్రసన్నాస్మి సాహాయ్యం
చకృతం తవ॥ యదా త్వం రాక్షసైర్ఘోరైర్యాగకాలే ప్రపీడితః। తదా సర్వే
పిగీర్వాణాశ్శివం శరణమన్వయుః॥ తత్రాసీత్ కేశవః శ్రీమాన్ సర్వమా
యావిచక్షణః। తం దదర్శ మహాదేవో దృష్టిభిర్దశపంచభిః॥ ససర్జ మాం
సలక్ష్మీం స్త్రీం విష్ణుమాయేతి విశ్రుతాం। శంభోర్వ్యస్మహితం తేజో బ్రహ్మాణ

శ్చాపియన్మహాః ॥ ఇంద్రస్యోర్జో మహాశ్చాగ్నేశ్శక్తిర్వాయూదసాంపతేః । యమస్య కార్యాకుబేరాణాం సిద్ధానాంయక్షరక్షసాం ॥ వసూనాంచతథా శ్వినోర్మరుతాముష్ణపాయినాం । సురాణాంసురయోనీనాంయాస్తదివ్యా శ్చశక్తయః ॥ అవిశన్ మయి తాస్సర్వాశ్శంకరస్యప్రశాసనాత్ । సాహం తథావిధావత్స సర్వశక్తిమయీపదా ॥ కర్తుంతవైవ సాహాయ్యం సృష్టా హంపరమేష్ఠినా । మర్దయామాస మహిషం దుర్గంభగ్నమతానిషం ॥ జ ఘానరక్షసాం వ్యూహం తవయాగస్యరక్షణే । నిశీథే రక్షసాంసైన్యే జా నుమండలబోధితే ॥ ప్రపీడయతి తే సైన్యాం స్త్వయిదూరస్థితేసతి । రక్షసాం భయముత్పాద్య తవసైన్యానరక్షిషం ॥ త్వయియుద్ధాయసన్నద్ధేత్వామా విశ్యసదానఘ । శత్రూన్ నిహన్మిముక్తేశ వాత్సల్యాద్వత్సకే త్వయి ॥ ఇ తఃపరం త్వదర్థేహం కరిష్యామిమహత్ప్రియం । భావినాం తవవంశ్యానాం యోగక్షేమం వహామ్యహం ॥ తస్మాత్ త్వాంజ్ఞాపయామ్యద్య తవైవశు భహేతవే । త్వయా త్వద్వంశజైశ్చైవ కర్తవ్యం యత్తు తచ్ఛృణు ॥ గ ర్భాష్టమేవానవమే దశమేవా తమత్తరే । పుత్రస్యోపనయఃకార్యో గా యత్రీగ్రహపూర్వకః ॥ వివాహః కులకన్యాభిః కర్తవ్యశ్షోడశాదిషు । వే దోక్తేనైవమార్గేణ కుర్యుఃకర్మాణినిత్యశః ॥ బ్రాహ్మణస్తుపురస్కార్యః పి త్ర్యేదైవేచకర్మణి । వివాహకాలః కన్యానాం సప్తమోష్టమపవవా ॥ ఊ ర్ధ్వామృతుమతీంగచ్ఛేన్నానూఢాస్యాదపి క్వచిత్ । అనుసార్యాస్సదాచా రామనునాయేప్రదర్శితాః ॥ పరాశరాదిభిశ్చైవ ధర్మతత్వార్థదర్శిభిః । క్షత్రియాణాంతుకల్పేన కర్తవ్యంకర్మసర్వశః ॥ పురోధసంతు సమ్మాన్య వి ప్రవేదపురస్సరం । వినావిప్రేణయత్కర్మ స్వాతంత్ర్యాత్క్రియతేనఘ ॥ తత్కర్మ నిష్ఫలంవిద్ధి నరకస్యాపి కారణం । అహమస్మీహముక్తేశ త్వత్కు లేకులదేవతా ॥ వాసిష్ఠాస్త్వత్కులాచార్యాస్తైహి సర్వేత్ర సంస్మృతాః ॥ ఆదామర్త్యంతతోవాప తేషాంకర్మణికర్మణి ॥ అహంకులగురుశ్చైవ పూ జితవ్యౌ ప్రయత్నతః । మామప్రపూజ్య ముక్తేశ హిత్వా కులగురుంతథా ॥

బ్రాహ్మణాంశ్చైవ ధిక్కృత్య వినంక్ష్యతి భవత్కులం। కృత్వాపికుద్వ
కర్మాణి హిత్వాకులగురుంస్వకం॥ నైష్ఫల్యతశ్చ్యుతింయాంతి దేవతో
పితృణాదపి। తస్మాదహంపూజనీయా కులాచార్యస్తథైవచ॥ తేనశ్రీరా
యురారోగ్యం కులవృద్ధిశ్చభవిష్యతి। యథాకులగురోశ్చిత్తం సంతుష్యతి
ధనాదిభిః॥ తథాసమ్మానితవ్యోవస్త్రాలంకారేణధనేనచ। గణేశారాధనం
పూర్వం మమచారాధనంతథా॥ విస్మర్తవ్యో నతేవంశ్యైస్సదాత్మహిత
మిచ్ఛుభిః। కులాచార్యాననుజ్ఞానే కర్మచేత్క్రియతే హఠాత్॥ తత్క
ర్మగోవధఃప్రోక్తో నిరయశ్చైవకారణం। గాయత్రీగ్రహణంచైవ కులాచా
ర్యోపదేశతః॥ తదనుజ్ఞామనాప్యాపి వృథాస్యాదన్యథాకృతం। కులస్య
దేవతాంమాంచ కులాచార్యంతథైవచ॥ హిత్వాచరేద్యస్త్వద్వంశ్యస్స
శూద్రాదధమోనరః। మాంగళ్యేషు వివాహేషు మత్పూజాక్రియతేన
చేత్॥ తథాకులగురోశ్చైవ తదమాంగళ్యతాంవ్రజేత్। త్వత్కృతేయ
త్తుముక్తేశ మయోపకృతమంజసా॥ తత్సర్వథా నవిస్మార్యం త్వయాత్వ
ద్వంశజైస్తథా। ఏతదాఖ్యానకం సర్వం త్వద్వంశప్రభవైర్ద్విజైః॥ శ్రో
వ్యంవిప్రముఖాద్భక్త్యా తద్ధేతుస్సర్వసంపదాం। విద్వద్విప్రముఖాద్వాపి స
ద్గురోర్వా ప్రసాదతః॥ వత్సరే వత్సరేవాపి శృణుయాద్భక్తితస్సకృత్।
ఏతదాఖ్యానకంయస్తు తిరస్కుర్వీత మందధీః॥ సపతేన్నరకేఘోరే పూ
యశోణితకర్దమే। శ్రద్ధయాయః శృణోతీదం మమాఖ్యానకముత్తమం॥
తస్యాయచ్ఛామిముక్తేశ నిత్యకళ్యాణసంపదః। ఇత్యుక్తో ముక్తికోవానిర్వా
త్పుత్యైవ పరాంబయా॥ ప్రశ్రయావనతోభూత్వా పప్రచ్ఛ పరమేశ్వరీం।

* ముక్తర్షిరువాచ *

నమస్తేస్తు మహాదేవి వాత్సల్యాద్వక్తుమర్హసి॥ భావివృత్తంమదీయం
యత్త్వదనుగ్రహసంభవం। యథాదేవివిజానీయాం త్వామస్మత్కులదేవ
తా॥ దేవశక్తిమయీత్వేవం తద్రూపం దర్శయస్వమే।

* దేవ్యువాచ *

వత్సముక్తేశవక్ష్యామి భావివృత్తంచతావకం॥ పరిగ్రహీష్యసిత్వంహి సువ్రతాంమునికన్యకాం। తయాసమేయివాన్ధర్మాన్ కరిష్యసి బహూన్విధీన్॥ యావంతి పుణ్యకర్మాణి తావంత్యప్యాచరిష్యసి। లప్స్యసేష్టాం తపూజాం స్త్వమేకాంమహీతరంతథా। త్రైరేవ త్వత్కులం వత్స భూరిశో వృద్ధిమేష్యతి॥ ఋషిగోత్రాంకనంచైవ ప్రాజ్యసామ్రాజ్యమేవచ। శస్త్రాస్త్రధారణంచైవ రణేశత్రుజయస్తథా॥ భవిష్యంతి తవావశ్యం త్వద్వంశ్యానాం తత్తైవచ। చిత్రవిద్యాత్వదీయానాం కులవిద్యాభవిష్యతి॥ వైదికాచారనిరతా గురుబ్రాహ్మణపూజకాః। దేవతాభక్తియుక్తాశ్చత్వద్వంశ్యాఃక్షత్రియాస్సత॥ చిత్రక్రియాసు విఖ్యాతా భవిష్యంతి సదాహితాః అథమేమూర్తిమవ్యగ్రాం ద్రష్టుమిచ్ఛసి సువ్రత॥ దర్శయిష్యామి తేపుత్ర పశ్యమే రూపమద్భుతం। యేనదృష్టేన తేవత్స నభవిష్యతిసంశయః॥ ధీరస్సన్నవథానేన తిష్ఠభక్తియుతశ్చసన్। ఇత్యుక్త్వా దర్శయద్దేవీ దివ్యరూపం సనాతనం॥ దేవేషు ప్రేతమానేషు ముక్తస్వైస్సనికేషుచ। బ్రహ్మపీఠేషు మహత్త్రివం ముక్తేశాయమహాత్మనే॥ సర్వతః పాణిపాదంతత్సర్వతోక్షిశిరోముఖం। సర్వతేజోమయం దివ్యం సర్వసౌగంధ్యసమ్మితం॥ తత్రాపశ్యత్సముక్తేశ స్సర్వానింద్రాదికాన్సురాన్। ఆదిత్యాంశ్చవసూన్రుద్రాన్ మరుతశ్చతథోష్ణపాన్॥ విద్యాధరాన్ గుహ్యకాంశ్చ గరుడోరగకిన్నరాన్। అన్యాంశ్చ ఖేచరాన్మానీన్ బ్రహ్మర్షీన్ బ్రహ్మవాదినః బ్రహ్మాణం శితికంఠంచ కేశవం సపరిచ్ఛదం। సప్తసప్తచలోకాంశ్చ సప్తద్వీపాంవసుంధరాం॥ శైలాన్ వనాని క్షేత్రాణి సర్వమేతచ్చరాచరం। సహస్రాదిత్యసంకాశం దీప్యమానంసమంతతః॥ సర్వరూపమయంరూపం దదర్శ పరమోజ్జ్వలం। దృష్ట్వాతన్నిమిషాంబాయారూపమద్భుతముజ్జ్వలం హృదివిస్మిత్యవిస్మిత్య తుష్టావపరమేశ్వరీం। దేవాదిదేవతేదేవి సర్వలోకాధినాయిని॥ త్వాంవేద్మిసర్వభూతానాం సర్గస్థిత్యంతకారిణీం। సర్వ

దేవమయీంచైవ సర్వతేజోమయీం తథా॥ ప్రకృతిస్త్వం పరాంబా త్వం వికృతిస్త్వంమహేశ్వరి। విద్యాత్వంచ విభూతిస్త్వం శ్రద్ధాత్వం సర్వసాధినీ॥ లక్ష్మీస్త్వం లక్షణాధ్యాత్వం సర్వసౌఖ్యప్రదాయినీ। పశ్యామి దేవిదేహేతే త్రైలోక్యంచచరాచరం॥ నతదస్తివినావస్తుత్వాస్సంబంధేనయద్భవేత్। త్వయావినానతిష్ఠన్తి దేవాఃకిముత మానుషాః॥ త్వత్సాహాయ్యాద్దేవనిహతస్తాదృశోజానుమండలః। తంచ దుర్గాసురంహంతుం తాదృశంమహిషాసురం॥ కశ్శక్నుయాన్మహాదేవి సర్వశక్త్యాత్వయావినా। మద్వంశ్యానాంమహాదేవి భవత్వంకులదేవతా॥ మయినిత్యం ప్రసాదేన వసత్రిపురసుందరీ। మద్వంశ్యానాం సదాచారం విభూతిం కీర్తిమేవచ॥ అవిచ్ఛేదేన రక్షత్వం కటాక్షైః కరుణాంచితైః। త్వామప్రపూజ్యమేవంశ్యానకుర్యుః కర్మకించన॥ తవానుశాసనేనైవ వాసిష్ఠాచారకంమతం। ఉపదేశస్త్వదీయోయం భవత్యస్మాస్వనుగ్రహః॥ ఉపసంహరతేరూపంసర్వలోకాద్భుతోపమం। ద్రష్టుమిచ్ఛామి మాంత్యక్త్వా ప్రసన్నాం రుచిరాకృతిం॥ ఇతిముక్తేశవచనం శ్రుత్వాసానిమిషాంబికా। సుకుమారం దధౌరూపం ద్రష్టౄణాంసుమనోహరం॥ తతస్తాం సుకుమారాంగీం పూర్ణచంద్రనిభాననాం। పల్లవోపమపాణ్యంఘ్రీం నీలనీలాలకాంచితాం॥ మనోరాభిరామవక్షోజాం వేదీలగ్నవలగ్నకాం। చంచత్కాంచీకనచ్ఛ్రోణీం పాదాబ్జాంచితహంసకాం॥ తాటంకరుచిసంయుక్తాం గండద్యోతితకుండలాం। వికసత్పద్మనయనాం విభ్రమద్భ్రూయుగాంచితాం॥ మందస్మితేన రాజంతీం రాజద్దంతపరంపరాం। సమస్తలోకజననీం సమీక్ష్యనిమిషాంబికాం॥ భక్త్యానిపత్య పాదాబ్జే ననామమునిపుంగవః। సాతముత్థాప్యదయయాపంస్పృశంతీచ శీర్షకం॥ వత్సజేష్యసి భద్రంతే సాధయేత్యభిధాయ సా। అంతర్దధే మహాదేవీ పశ్యతాంత్రిదివౌకసాం॥ అథ ముక్తమునిర్ధీరస్సహితస్త్రిదశోత్తమైః। మునిభిశ్చ వసిష్ఠాద్యైర్గంధర్వగరుడోరగైః॥ ప్రతస్థేతతస్సుప్రీతః పురాకేరాశ్రయంగిరిం। సర్వేదేవాశ్చసిద్ధాశ్చ సాధ్యాశ్చ

పరమర్షయః॥ ద్రష్టుం కైలాసనాథం తం భక్తికౌతుకపూర్వకం। మార్తికం
చపురస్కృత్య యయుః శైవాలయం ప్రతి॥ కైలాసాద్రింసమాసన్నాస్సర్వే
సంతోషశాలినః। సువర్ణరత్నాభరణై ర్భూషితా దివ్యతేజసః॥ దివ్యమా
ల్యాంబరధరా దివ్యాలంకారశోభితాః। కైలాసవాసినం దేవం భక్తాభీష్ట
ఫలప్రదం॥ శివం దృష్ట్వా నమస్కృత్య స్తోతుం సముపచక్రముః। జయశంక
రసర్వేశ పార్వతీహృదయప్రియ॥ త్రిపురాంతకలోకేశ చంద్రమౌళేన
మోఽస్తు తే। నమస్తే నీలకంఠాయ కాలకూటధరాయచ॥ నమస్తే వేదవా
హాయ నమస్తే గిరిధన్వనే। నమస్తే కాలకాలాయ వ్యోమకేశాయ తే నమః
త్వమేవ విశ్వమఖిలం త్వం దైవం పరమం ప్రభో। భూతానాం త్వం జనయి
తా త్వం సర్వేషాం చపోషకః॥ సంహారకర్తా సర్వేషాం త్వమేవ త్వత్ప
రో నహి। యద్యద్విచేష్టతే లోకే యత్ర యత్ర యథా యథా॥ తత్తథా చే
ష్టితం శంభో త్వత్సంకల్పప్రభావతః। కోన్యః సృజేన్మహేశాన తవాజ్ఞాను
మదంతకం॥ సర్వసద్గుణసంయుక్తం సర్వభూతప్రియంకరం। ముక్తషీమీ
దృశం వీర మార్యక్షత్రియసత్తమం॥ త్వత్సృష్టే నామునా శంభో కృతం కా
ర్యం మహత్తరం। నిహతో జానువాన్ వీరస్సర్వలోకైకకంటకః॥ సర్వే దే
వాస్సగంధర్వాస్సయక్షగరుడోరగాః। సర్వే సంస్థాపితా బ్రహ్మన్ స్వే
స్వే సుమహితే పదే॥ బ్రాహ్మణాస్సుఖితాస్సర్వే నిర్విణ్ణాః పరమర్షయః।
నిర్విఘ్నితాశ్చ క్రతవః సర్వసంభారసంభృతాః॥ తదేతత్తవ మాహాత్మ్యం
సర్వలోకశుభావహం। అనుసంధాయనః ప్రీతిః పర్యాప్నోతి నశంకర॥ వ
యమేతస్సముక్తక్షే శ్శుభమాశంసనః పరం। ప్రార్థయిష్యామహే త్వాంతు
సర్వలోకోపకారిణః॥ ఇతిస్తువానాన్ సంప్రేక్ష్య మార్తికంచజయప్రదం।
రసంస్పర్శనంకృత్వా పుత్రం దైతేయఘాతినం॥ ప్రశస్య దేవదేవేశ ఉవా
చమధురంవచః భో పుత్ర తవకల్యాణం భవిష్యతినసంశయః॥ ఇత్యుక్త్వా
స్వాంకమారోప్య లాలయన్ వచనైశ్శుభైః। సస్మార శంకరస్సాక్షాత్
శ్రీధరం దేవమచ్యుతం॥ తస్యస్మరణమాత్రేణ భగవాన్ భూతభావనః। ఆ

జగామమహావిష్ణుః శ్రీధరోగరుడధ్వజః॥ తంనిరీక్ష్య నమశ్చక్రుస్సర్వేదె వాస్సహర్షయః। ఉద్ధాయాభ్యుద్గతేనాథ శంకరేణకృతాత్మనా ॥ పాణి నాపాణిమాలంబ్య వేశితః కాంచనాసనే। ఉవాచశ్రీమహావిష్ణుశ్శంకరం లోకశంకరం॥ దిష్ట్యాతవప్రభావేన సాథితోజానుమండలః। దిష్ట్యాదేవా స్సగంధర్వాస్స్వశ్రియంప్రతిపేదిరే ॥ దిష్ట్యామహర్షయస్సర్వే హర్షోత్క ర్షసమన్వితాః। దిష్ట్యాలోకాః ప్రముదితా నిష్ప్రపీడాశ్చతుర్దశ ॥ అస్మిన్ కాలేస్మృతింజ్ఞాత్వా మహేశతవసాంప్రతం। వేగాత్సముతయాతోహం వక్తవ్యంబ్రూహిశంకర ॥ ఇతివిష్ణోర్వచఃశ్రుత్వా శంకరఃప్రాహసస్మితః। నైతచ్చిత్రంమహావిష్ణో యద్ధతోజానుమండలః ॥ ఆవయోఃకిలసంకల్పే స ర్వోలోకోవ్యవస్థితః। శక్యఃసంకల్పమాత్రేణ కర్తుంజానుమతోవధః॥ త థాపిదిద్విలాసార్థం శిల్పముత్పాదయావహే। లేభేవరమయంధైత్యః ప ద్మజాత్పరమేష్టినః ॥ యథానస్యాన్మృతిస్తస్య కస్మాచ్చిద్ర్బహ్మసృష్టిగాత్ తదన్యథాకర్తుమేవం స్రష్టాసౌమాక్తికోమునిః ॥ హిరణ్యకశిపుర్నామము రారేదితిజఃపురా। వరానుపాదదేస్రష్టుర్యదానసమ్మృతింవ్రజేత్ ॥ దివసే చతథానక్తం పూరుషాద్వామృగాదపి। తదాపితం త్వమాస్థాయ నరసి హాకృతింహరే ॥ సోయంస్తంభాచ్చ సంభూయ క్షణాద్వక్షస్య దార యత్। అస్తిమేహ్యగయావిష్టవస్తుకర్తవ్యమంజసా ॥ మద్భాహుసంభవ స్యాస్య ముక్తాగ్నేమార్గితౌజసః । అర్కక్షత్రకులంనామ లోకేవర్తయితుం కులం ॥ లోకేక్షత్రకులంయద్వచ్చంద్రసూర్యసముద్భవం। మద్భాహూ ద్భవమేతచ్చ తారకావధివర్తతాం ॥ అస్యవత్సవ్య ముక్తాగ్నేః కార్యంవైవా హ్యముత్తమం। ఆన్వేష్టవ్యాకులీనాచ కన్యాకల్యాణభాగినీ ॥ మునీనా మేవగోత్రేషు క్వచిత్సుచరితవ్రతా। ఇతిశంభోర్వచఃశ్రుత్వా విష్ణుఃప్రా హమహేశ్వరం ॥ ధ్యాత్వాముహూర్తం భవ్యాత్మా భగవాన్ భూత భావనః।

* విష్ణురువాచ *

పూర్వమేవమయాశంభో సర్వమేతద్విచింతితం ॥ అస్తి దుర్వాససః కన్యా మునేః మున్యాశ్రమే శుభా । ముక్తికాంతేతి విఖ్యాతా మోహనాంగీ ముదావహా ॥ కదళీగర్భసంజాతా ముక్తేశస్యకృతే మునేః । ఇంద్రనీలాలకోపేతా చంద్రబింబనిభాననా ॥ శ్రీవర్ణకర్ణయుగళీ కర్ణాంతాయతలోచనా । ఆపాండుగండముకురా కంబుకంఠీసునాసికా ॥ చక్రాకారస్తనద్వంద్వా చారుదోర్వల్లికాంచితా । తరంగత్రివళీయుక్తా సింహశాబకమధ్యమా ॥ నీలరోమావళీరమ్యా పీనవృత్తకటీతటీ । రంభాస్తంభోపమోత్సంగా ప్రస్ఫురత్పాదపల్లవా ॥ మాద్యన్మరాళగమనా కోకిలాలాపకోమలా । ప్రసూనసుకుమారాంగీ నఖనక్షత్రభాసురా ॥ కన్యా దుర్వాససో మునేః కమనీయగుణాకరా । సా తేనమునినాసాధ్వీ దత్తాముక్తకర్షయే ॥ తాముద్దిశ్య వరారోహాం నయ దుర్వాసనేవచః । సాహంభవతి గౌరీశ మౌక్తికాయసుధీజుషే ॥ ఇతివిష్ణోర్వచఃశ్రుత్వా మునీన్దృష్ట్వాచ శంకరః । ఉవాచపరమప్రీతో వాచంహృదయహారిణీం ॥ అహోహోమునివరాయూయం వాసుదేవవచోయథా । గత్వాదుర్వాససఃపుణ్య మాశ్రమంసుమనోహరం ॥ శృణుధ్వంముక్తమునయో వివాహార్థంసుశోభనాం । బృహదారణ్యమధ్యస్థాం శుభలీలాంమనోరమాం ॥ మాలతీసదృశాకారాం మాననీయగుణాంవితాం । దుర్వాసఃపుత్రికాంరమ్యాం ముక్తికాంతాంశుభేక్షణాం ॥ బింబాధరీం విశాలాక్షీం జటావల్కలధారిణీం । ఇదానీమృషిభిస్సార్థం గమ్యతా మృషిసంశ్రయం ॥ శృణుధ్వమృషయస్సర్వే యథామద్వాక్యమాదరాత్ । సముహూర్తేశుభతిథౌ ముక్తికాంతాంమనోరమాం ॥ మమమానసజాతస్య ముక్తేశస్యగుణేశితుః । పాణిగ్రహంవినిశ్చిత్య దుర్వాసోనుమతస్థితాం ॥ కుర్వంతుశుభకార్యాణి వైవాహ్యానిని శాస్త్రతః । యదాస్య వంశజాతానాం మౌక్తికానాం శుభాత్మనాం ॥ సర్వేషాంమమభక్తానాం విష్ణుభక్తజుషామపి । వేదోక్తేనైవమార్గేణజా

తకర్మాదికాః క్రియాః। భవిష్యంతిమహాభాగాః సర్వాఃతుత్రియకల్పతః ॥
తదాస్మదీయస్సంకల్పస్తదోన్వస్త్వభిమతం హితం। ఓమిత్యుక్త్వార్షయస్స
ర్వే బృహదారణ్యకంగతాః॥ నత్వా విష్ణుంగిరీశంచ కృత్వామూర్ధని శా
సనం। సర్వేతే మునిశార్దూలా దేవాశ్చేంద్రపురోగమాః। యక్షాశ్చకిన్న
రాశ్చైవ సర్వేగంధర్వపుంగవాః॥ సదాశివంనమస్కృత్య యయుర్దుర్వా
ససోవనం। దేవదుందుభయో నేదుర్ననృతుశ్చాప్సరోగణాః॥ అవవౌసుర
భిర్వాయుః పుష్పవృష్టిః పపాతభూత్ । తతః సంతుష్టచిత్తాస్తే తపోవనము
యుస్తదా॥ విలసత్పుష్పసంకీర్ణలతాకుంజాభిశోభితం। క్రీడద్భిర్దేవనికరైః
పత్నీభిస్సహసంగతైః॥ విభాన్తం ఫలసంకీర్ణైర్వృతజాలైస్సమాకులం।
కమలోత్పలవిస్ఫారకమలాకరశోభితం॥ వియచ్చరాణాం నికరైః పరి
వ్యాప్తంసమంతతః। ఆదిత్యపూజనాసక్తమునిపత్నీకుమారకం॥ ఉటజాం
గణభూమీషు రోమంథిమృగతర్ణకం। చారుతీర్థావతారేషు స్నాతోత్తిష్ఠ
న్మునివ్రజం॥ మహామహీరుహశ్శాఖాసు దృఢసంసక్తవల్కలం। హోమా
జ్యధూమపాళీభిస్సమంతాచ్చ సుగంధితం॥ దదృశుస్సుమహారమ్యాం
పుణ్యారణ్యం మహర్షయః। తన్మధ్యసంస్థితంశాంతం తపోనిష్ఠాసమన్వితం
రమ్యపద్మాసనాసీనం పశ్యంతం జ్యోతిరాంతరం। సహస్రాదిత్యసంకాశం
సౌమ్యరూపంసువర్చసం॥ జాతరూపతనుచ్ఛాయం జటామండలధారిణం
రుద్రాక్షభూషితోరస్కం స్మితభస్మావకుంఠితం। దదృశుస్తేమునిశార్దూలం
దుర్వాససమహౌజసం॥ యోగాదపారతస్సోయ ముజ్జన్నచ్ఛాభ్రసమం
జసా। తాన్ సమభ్యాగతాన్ మాన్యాన్ సమ్మాన్యమునిపుంగవః॥ సుఖాసీ
నేషు దుర్వాసా స్సహర్షిషుమహర్షిషు॥ ఉవాచపరమోదారః పరమా
ర్థపరంవచః। స్వాగతంమునిశార్దూలాః సంతోషాయమమాద్యవః॥ సం
తాంసద్భిస్సహాసంగః పుణ్యేనహిభవిష్యతి। సంగతం పూర్వపుణ్యేన పు
ణ్యాయుద్యతనంస్వతః॥ శుభస్య భావినశ్చేదం సమాగమనకారణం। ఉత్ప
శ్యామిశ్శుభోదర్కంభవదీయసమాగమాత్ ॥ అదిరేణభవిష్యంతం నాస్య

థాసస్సమాగమః। ఆగచ్ఛథకుతో దేశాత్కుత్రవా ప్రయువాసనః ॥ ఇహా
చ్ఛథకంవార్థముద్దేశోఽస్తి కింనువః। అథవా పావనాయైవ భువిపర్య
టనంహివః ॥ ప్రసంగాయథ వేదేవ యదేషాసముదీరణా । దుర్వాససో వ
చశ్శ్రుత్వా ప్రాహుస్తే పరమర్షయః ॥ ఆగచ్ఛామోవయం శంభోరాల
యాద్రజతాద్రితః। గృహీత్వా తస్యసందేశం శుభోదర్కం తవాంతికం
ససర్జఖలు యంశంభుర్జ్ఞానమన్నామహాత్మనే। ముక్తగ్నిర్నామయోగీం
ద్రమార్యతస్త్రియసత్తమం ॥ తస్యదిగ్జితదైత్యస్య సుజాతస్య సువర్చసః। మ
హాత్రాతవకల్యాణమాలతీసుమజాతయా॥ ముక్తికాంతాఖ్యయాసార్ధం
వివాహంకర్తుముత్సుకః। నిర్దేశేన మహావిష్ణోః ప్రజిఘాయ పురాంతకః ॥
తవాపి విదితంసర్వం వృత్తంముక్తేశితుస్స్వతః। మహేశవీర్యజాతస్య స
ముత్పాదితరత్నసః ॥ ప్రభావిభాకరేణేవ కౌముదీవ కలాభృతా। ముక్తి
కాంతాభవేద్యుక్తా శుదినాముక్తమానినా ॥ శాసనాత్త్రిపురారాతేః కే
శవస్యాపిసమ్మతేః। అర్హత్వాత్సు ప్రశస్యత్వాత్సాగ్యం మన్యామహే వ
యం ॥ ఇదంతు తవవిజ్ఞప్తం యథాభూతేశశాసనం। అనంతరం యథా
వృత్తం ననివేద్యోభవాన్వరైః॥ ఇతి తేషాంవచశ్శ్రుత్వా స్మయమానము
ఖాంబుజః। ప్రాహప్రశ్రయవద్వాక్యం దుర్వాసామునిపుంగవః ॥

* దుర్వాసా ఉవాచ *

ధన్యోఽస్మ్యనుగృహీతోఽస్మి దర్శనాదేవవస్స్వతః। శృత్వాశంకరసందేశ
మానందే మజ్జితంమనః ॥ కార్యేచాస్మి యథాయూయమహామస్మి త
థావిధః। కన్యేయం యుష్మదీయాచ మామకీనేవతత్వతః ॥ యన్మేమూ
లంఫలంవాపి నపరాధీనమస్తువః। శాసనం శిరసాధార్యం మహాపి ఖలు
శూలినః ॥ నిశ్చిత్యబ్రూత భద్రంవో యథా శంకరశాసనం। ముక్తికాం
తాభవద్వాక్యం ముక్తేశాయ ప్రదిత్సితా ॥ ఇత్యుక్త్వా పార్శ్వతో దృష్టిం
ప్రసార్యపరమోమునిః। తస్థుషీం తత్ర తాంకన్యాంలజ్జయావనతాననాం
హేలానలినపత్రాణి గణయంతిమవస్థితాం। ముక్తికాంతాంసమన్వీక్ష్య

సమాహూయ చ సంజ్ఞయా ॥ ఏహి కళ్యాణి భద్రం తే త్యక్త్వా ప్రత్యాగ
తాంసుతాం । అంకమారోప్య తాం దృష్ట్వా మునీన్ స్మేరాననో మునిః ॥ స
మాతీయమ్మునిశ్రేష్ఠా ముక్తస్థైర్ధర్మచారిణీ ॥ ఇత్యుక్త్వోద్వాప్య తాం కన్యాం
నమయామాస తాన్నృషీన్ । తేచ తాం సస్మితాపాంగాం ప్రణమన్తీం
వినీతితః ॥ ముక్తేశం ప్రాప్య భర్తారం సౌభాగ్యేన సమన్వితా, మహిషీ వా
చ్యుతస్సత్వాం మహితా సర్వసజ్జనైః ॥ పుత్రాన్ రూపగుణోపేతాన్ శూ
రాన్ ప్రాప్య సువర్చసః । వర్ధస్వ భూరికళ్యాణైరితి ప్రాయుంజతాశిషః ॥
అంతర్హితాస్తదా దేవా వృత్తమాలక్ష్య తాదృశం ॥ సాధుసాధ్వితి సంభా
షం తథాస్త్వితి మహామహాః, అథ తే మునయస్సర్వే స్తుత్వా దుర్వాస
సం మునిం ॥ త్రిరాత్రమవధిం కృత్వా వివాహస్య శుభావహం । ముహూ
ర్తం చ వినిశ్చిత్య ప్రయయుస్సరాజితం గిరిం ॥ కృతార్థానాగతాన్దృష్ట్వా
మునీన్ సంతుష్టమానసః । జ్ఞాతార్థోఽపి మహుశ్శంభుః పప్రచ్ఛ దంతమా
దితః ॥ నివేదితే యథావృత్తం కన్యావృత్తాంతవిస్తరే, సంనాహం కార
యామాస వివాహేయ మహేశ్వరః ॥ మునిదుహితరమేవం ముక్తికాం
తాముమేశః కలయితుమభిలాషీ మౌక్తికస్యాద్వితీయాం । పరిణయమహా
సిద్ధ్యై భూరిసంభారసంపత్పరికరఘటనార్హాన్ యోజయామాస భృత్యాన్

ఇతి శ్రీ బ్రహ్మాండపురాణే బ్రహ్మనారదసంవాదే వర్ణ్ణవైభవ
ప్రస్తావే మౌక్తికోపాఖ్యానే ముక్తేశవివాహసంనాహో
నామ చతుర్దశోఽధ్యాయః శ్రీ శ్రీ

శ్రీరస్తు.

కళ్యాణం భూయాత్.

## శ్రీ బ్రహ్మాండపురాణే వర్ణవైభవ ఖండే ముక్తస్యూపాఖ్యానే పంచదశోధ్యాయః.

నారదఉవాచ॥ పరమేష్ఠిన్మహాప్రాజ్ఞా ప్రబ్రూహి సమనంతరం। ముక్తమానినమాఖ్యానం శ్రోత్రపేయరసోల్బణం॥ తద్వివాహప్రకారంచ జాయయాసహవర్తనం। తత్పుత్రజననంచైవతన్నామానివిశేషతః॥ యదన్యదపివక్తవ్యం కృపయావద పద్మజ।

* బ్రహ్మోవాచ *

తథాపాణిగ్రహే యాతుముద్యతస్య మహౌజసః॥ ముక్తేశస్యదదౌ పింద్రః కిరీటంరత్నశోభితం, కుండలే ప్రదదావహ్ని ర్వరుణో రత్నమాలికాం॥ కుబేరో రత్నకేయూరే వలయే ప్రదదౌహరిః। ముక్తాహారాన్ సదావద్భిః కటిసూత్రంది వాకసః॥ శ్వేతచ్ఛత్రం దదౌ చంద్రస్సూర్యశ్చామరయుగ్మకం, ఆదాయతదివంకృత్స్నమార్యతుశ్రియసత్తమః॥ కాంచనంరథమారుహ్య హేమాముకుందోద్భవంశుభం, శంఖ కాహళ భేర్యాది నానావాద్యసమన్వితః॥ సంవేష్ట్యమానః పరితః సుపర్వగరుడోరగైః। బ్రహ్మర్షిభిర్బ్రహ్మవిద్భిః వేదఘోషసమన్వితైః॥ శంభునాసన్నికృష్టేన మహాత్మమధితిష్ఠతా। ప్రమథైస్సమవేతేన వాత్సల్యాదనుయాయినా॥ విష్ణునాసహభృత్యేన వైనతేయాధిరోహిణా। రత్నైర్విద్యోతమానేన

పార్శ్వే సుప్రష్ఠితేనచ ॥ శింజన్మంజీరపాదేన చారుబిబ్బోకశాలినా ।
శ్రోత్రపేయగానేన భాస్వతా రత్నభూషణైః ॥ హారహారావలీరమ్య
పీనవక్షోజశోభినా । చంచత్కాంచీపరిక్షిప్తనితంబతటభాసినా ॥ గణి
కానాం సమాజేన స్వర్గలోకేమహీయతా । నృత్యాంగహారరమ్యేనప్రా
రితాఖిలముఖావనిః ॥ ముక్తేశః ప్రగుణ్యాశ్రీమాన్ దుర్వాసస్తాపసాశ్రమం
తదావిమృశ్య మేధావీ నివేశం స్వానుయాయినాం ॥ ఉపకల్పితుమాత్మ
జ్ఞో ముక్తేశో మునిపుంగవః । ఇయేష హృదినిర్మాతుం రాజార్హం నగరీంత
థా ॥ ముక్తేశోసౌ తపశ్శక్త్యా మనసాకృతనిశ్చయః । సస్మారవిశ్వకర్మా
ణం సర్వలోకోపకారిణం ॥ స్మారితస్సన్సమాయాతో విశ్వకర్మావిచక్షణః ।
ఆగతంతం సమాలోక్య వాక్యమేకమథాబ్రవీత్ ॥ విశ్వకర్మన్ మహాబు
ద్ధే మమాత్రైవశుభంమహత్ । కర్తవ్యం దివ్యభవనం లోకత్రయవిచిత్ర
కృత్ ॥ పురీచ విపులా రమ్యా రత్నసానుసమప్రభా । విశాలతరసాలాచ
చంద్రశాలాశతాంచితా ॥ నిర్మిమీష్వ త్వరాద్ధేం త్వంహి సర్వవిచక్షణః ।
గార్హస్థ్యం కర్తుమిచ్ఛామి మందిరే త్వద్వినిర్మితే ॥ తథాస్త్వితిమహాప్రా
జ్ఞో విశ్వకర్మావిచక్షణః । చకార రత్నఖచితాం స్వర్ణప్రాకారశోభితాం ॥
సౌధైరలంకృతాందివ్యాం మందరాద్రిసమోన్నతైః । అట్టాలకైః పరివృ
తాం కూటాగారైర్విశేషతః ॥ బహుచాపకాగ్ర్యభూయిష్ఠాం వాపీకూప
శతాంచితాం । అగాధపరిఘాయుక్తాం బృహత్తోరణభాసురాం ॥ పతా
కాశతసంకీర్ణాం నానావాద్యవిశేషితాం । యంత్రపాంచాలికాయుక్తాం శ
తఘ్నీశతసంకులాం ॥ ప్రభావతీంపురీం నామ్నా దివ్యాలంకారదీపితాం ।
నానాచిత్రశతోపేతాం సద్యోనిర్మితవాన్యథా ॥ తాంపశ్యన్నేవసహసా
యయౌదుర్వాససోవనం । ముక్తేశాగమనంశ్రుత్వా మోదమానోమహా
మునిః ॥ అభ్యుజ్జగామ దుర్వాసా స్వమాణిస్యైవిచాశ్రమం । తత్రాశ్రమే
మహారమ్యే నభశ్చుంబిమహీరుహే ॥ వివిశుర్దేవగంధర్వా సిద్ధాశ్చపర
మర్షయః । విష్ణుశ్చ శంకరోజిష్ణుర్దేవాశ్చ గరుడోరగాః ॥ తదాతత్రసమే

తానాం దేవానాం దివ్యయోగినాం। సమ్మాననక్రియావ్యగ్రం తమువాచ త్ర్యంబకః॥ మునీంద్ర శృణు మద్వాక్యం పరమం మే హితం వచః। అస్త్యత్రానతిదూరేణ విశ్వకర్మవినిర్మితం॥ ప్రభావతీపురం దివ్యం వజ్రవైడూర్యభాసురం। తపఃప్రభావసంభూతం ముక్తైర్భావితాత్మభిః॥ తత్ర గత్వా శుభం కార్యం నిర్వర్తయితుమర్హసి। తత్రైవ సర్వసంభారా సంభవిష్యన్తి చక్షుణాత్॥ ఇతి తస్య వచః శ్రుత్వా తత్సంద్రష్టుం కుతూహలీ। తత్రైవాస్త్వితి ముత్వాసా స్తదంగీకృతవాక్ వచః॥ మోదమానమనాశ్చాథ పిత్ర్యకాం మునికన్యకాం। మునిస్త్వనతిదూరేతాం ముక్తికాంతాం మనోరమాం॥ దృష్ట్వాసౌ మునినాయుక్తఋషిసంఘైస్సమావృతం। సురానీకైః పరివృతః ప్రావిశన్నగరీం తదా॥ తదంతరే స్వర్ణభిత్తిభాసురం దివ్యమందిరం। ప్రవిశ్యాపౌతయాయుక్తో వివాహార్థం సునిశ్చితం॥ రేజే ముక్తేశ్వరో భూరి వికసన్ముఖపంకజః। నగరీం రత్నసంకాశాం మందిరం రత్నచిత్రితం॥ తద్దృష్ట్వా విస్మితాస్సర్వే మునయో దివ్యతేజసః। తతః పరం కామధేనుం సస్మార మునిపుంగవః॥ తదాగతా కామధేను రిష్టకామఫలప్రదా। సమాయాతాం తు తాం మౌనిరువాచ మధురం వచః॥ హే ధేనో సర్వసంభారాన్ వివాహార్థం మమాధునా। మద్గాస్మిన్ మందిరే రమ్యే స్థిత్వా కామాన్ ప్రసూష్వ మే తథేతి సా కామధేను స్తస్యాభీష్టాన్ మనోరథాన్। అదోహ సుబహూన్నిత్యం తన్మహూర్తాదినే ష్వథ॥ ఆగత్య శంకరో దేవో మోదమానో వ్యవస్థితః। సర్వం సకల్పితస్సిద్ధం మౌక్తికస్య సుమేధసః॥ లక్ష్మ్యాదయస్తథాజగత్పాత్ర్యశ్చ కేతుస్తదాహరిః। శైవాశ్చ వైష్ణవాశ్చైవ నానాలంకారభాసురాః॥ తముద్వాహమహం ద్రష్టుం సకౌతుకమవస్థితాః। తచ్ఛ్రుత్వాసురనాయకాదివిబుధాశ్చాగత్య పత్నీయుతాః। శ్వేతద్వీపమురిందమాభువనసం సేవ్యం యథాత్యుత్సుకాః। తద్గేహం శుభశంసిరత్నకలితం సంప్రాప్య తే పర్వతో విష్ణుశ్చైవ శివస్య పార్శ్వయుగళే సంతుష్టచిత్తాః స్థితాః॥ విష్ణుర్బ్రహ్మ త్వహస్పతిః పశుపతిస్తార్క్ష్యః సమేత్యైకతః శంభుస్తారకజిద్గణాధిపాదిః

త్యే తే సమేతాస్సన్యతః, దేవాశ్చాపి శచీపతిః పితృపతిః శుక్రస్యవాస్తోష్ప
తిశ్చైతే న్యేపరితశ్చ తచ్ఛుభగృహం సంభాసయాంచక్రిరే ॥ కౌండిన్యశ్చ
భృగుః పరాశరగురుర్వత్సశ్చ వాత్స్యోమునిః కౌత్సః కణ్వమునిర్వసిష్ఠకపి
లౌ ప్రసన్నా కాత్యాయనౌ। భారద్వాజ మృకండు గాలవముఖాన్మాం
డవ్యమాద్గల్యకౌ జాతూకర్ణ్యమతంగకప్రభృతయస్సర్వేమునీంద్రాస్థితాః ॥
ఇత్థం సుశ్వైర్యయుతమహాచారగాద్యైర్మహర్షిభిః శ్చాప్సరసాంగణైశ్చ। అ
తిష్ఠితం తన్నగరం తదాభూన్మహోజ్వలా భైరమరావతీయథా ॥ సము
చ్ఛలతేనవమాలికాభి స్సుగంధిధూపైః ప్రవిసర్పిభిశ్చ। ముక్తావళీభిస్మ
తోరణైశ్చ రేజేపురీ దివ్యతరాప్రభావతీ ॥ భేరీమృదంగప్రముఖైరనేకైః త్ర
తాడితై ర్మంగళవాద్యభేదైః। చరత్పురంధ్రీమణినూపురాద్యై ర్మత్తేభ
ఘంటానాదశృంఖలాద్యైః ॥ రంభోర్వశీముఖ్యవిలాసినీనాం నృత్యస్వనై
ర్మాణుపురశింజితైశ్చ। తపస్వినాం సుస్వరవర్ణయుక్తై రామ్నాయఘోషై
ర్నితరాంగభీరైః ॥ తురంగమానాం సమలంకృతానాం శృంగారపుంఖిస్స
మధిష్ఠితానాం। ప్రహేషితైశ్చ ప్రచురైర్నినాదైః ప్రభావతీపూర్ణకుతూ
హలాభూత్ ॥ ఏవంవిధే వర్తమానే మహాఘోరే మహోత్సవే। స
మేత్య కార్తికశ్శంభుం ప్రణనామ నతాననః ॥ తం సమీక్ష్య ముదా శంభు
ర్జువాచ మధురంవచః। హేవత్స శుభకళ్యాణ దీక్షాయుక్తోభవాధునా ॥
ఏవమాజ్ఞాపితస్తేన శంభునా కార్తికోమునిః। మాంగళ్యపీఠమధ్యాస్తైపు
రంధ్రీపరివేష్టితః ॥ మంగళాచారసంపన్న స్సోభ్యంగస్నానమాచరత్।
స్నానోత్థితోథ ముక్తేశశ్శుద్ధవస్త్రాణిధార్యచ। లలాటే చందనంధృత్వా
ధృత్వారక్తాక్షతాన్ శుభాన్ ॥ తత్ర సన్నిహితాభిశ్చ దివ్యస్త్రీభిః ప్రకల్పి
తాన్। కల్పవృక్షసముత్పన్నాన్ నానాలంకారసంచయాన్ ॥ సౌవర్ణాన్
రత్నఖచితాన్ దీప్త్యావిచిత్రప్రభాంచితాన్। కేయూరౌ కటిసూత్రంచ
కుండలే మకుటంతథా ॥ వలయాంచ మహామూల్యాన్ మణిహారాంశ్చభాస్వ

తః । ధృత్వా శుభ్రశిరోపేతః స్వపురం శ్రీవిభూషితః ॥ చకార చాంది
నీంచర్మాభన్నేత్రేణానంజయత్నతః । పాదుకే పరిజగ్రాహ సౌవర్ణే కింకిణీ
యుతే ॥ దండం కనకరత్నాఢ్యం దివ్యజ్యోతిఃప్రభాయుతం । కరేణ ప్రతిజ
గ్రాహ కర్ణముక్తాతపత్రకం ॥ ఏవముక్తమునిశ్శీఘ్రం మంగళాచారసం
భృతః । వసిష్ఠం సంప్రణమ్యాగ్రే విష్ణుశంకరశాసనాత్ ॥ విష్ణోరథ శివ
స్యాంఘ్రీ గృహీత్వా భక్తిపూర్వకం । తన్నియోగాన్మహామూర్త్యే నిషసా
దవరాసనే ॥ సమాహూయ తదా శంభుర్వసిష్ఠం బ్రహ్మణస్సుతం । అది
త్యేపీతం వికటే ప్రాహ ప్రకటితం వచః ॥ వసిష్ఠ తవ శిష్యోసౌ ముక్తిషేణో
ద్విజోత్తమః । తస్య తత్కులజానాంచ త్వం త్వదీయాస్సదానఘ ॥ అధ్వ
ర్యవముపస్థాయ కురుధ్వం వైదికీక్రియాః । యూయం ఖలు కులాచార్యాః
సర్వేషాం తు త్రిగోత్రిణాం ॥ తదార్యత్వత్క్రియాపతే భవిష్యత్యసంశయః
తద్వ్యత్యస్మాననువర్తంతే తపతేజా క్తికాభువి ॥ యద్యైతే హ్యతివర్తంతే భవి
ష్యంతి కులచ్యుతాః । తస్మాద్వసిష్ఠమునీంద్ర శిష్యస్య తవ సాంప్రతం ॥ కు
రు వైవాహికం కర్మ యథామంత్రవిధిక్రమం । ఇత్యుక్తో శంకరేణాథ విష్ణు
నా చానుమోదితః ॥ ఓం తథాస్త్వితి మునీంద్రో వసిష్ఠో బ్రహ్మణస్సుతః ।
గత్వా శీఘ్రం సమాగమ్య మర్త్యానసమృషీశ్వరం ॥ త్వరయామాస వే
దజ్ఞో ముక్తికాంతాసమానయే । మర్త్యాసపోనిదేశేన తాపసీనాం ప్రయ
త్నతః ॥ ముక్తికాంతా చ సుస్నాతా చారుచామరకేశినీ । దివ్యే మరపు
రంధ్రీభిశ్చ తుమ్రం రత్నశోభితం ॥ తత్ర రత్నాసనే చిత్రే తాం నివేశ్య ప
రాంగనాః । తద్గాత్రశోభాం భూతార్థాం పశ్యత్యః క్షణమాస్థితాః ॥ తా
లక్ష్మీపాసహైర్వ్యలద్ధైస్త్వరితాః కాలవేదిభిః । ఆరేభిరే రత్నభూషావిని
యోక్తుం తదంగకే ॥ కల్పభూమీరుహోత్పన్నా రూపతో విస్మయావ
హాః । కాచిత్కేశాన్ సుసంస్కృత్య ధమ్మిల్లం ప్రచకార హ ॥ కాచిత్తత్ర
సుగంధీని కల్పవృక్షోద్భవానిచ । పుష్పమాలాదీని సందర్భ్య చిత్రాణి లలి
తాని చ ॥ వేష్టయామాస విపులం లలితం చ మనోహరం । కాచిత్తస్యాః ప

మాణిక్యే తాటంకే సముదీధరత్ ॥ కుండలే ప్రచకల్పైకా దంతపత్రాణి
చాపరా । నానామణిమయాన్యాపి తిలకం లలితంపరా ॥ ప్రగృహ్యకాచి
త్తరుణీ కరేణాంజనకూర్చికాం । యుక్త్వానానంజవిమలే లోచనేశుభభూ
చనే ॥ హారావళీస్సువిశదా హిమాంశుధవళత్విషః । ఘటయామాస-త
త్కంఠే స్తనసంభారబంధురే ॥ కాంచీకలాపమపరా తస్యాస్సుఘనేఘ
నే । సజ్జయామాస తన్వంగీ సరసస్మితభాషిణీ ॥ తాదిన్మణిమరీచీభిసమా
చ్ఛాదిత భూతలం । నూపురద్వితయంతస్యే తదంఘ్ర్యోః ప్రత్యపాదయత్,
అన్యాపుణ్యపురంధ్ర్యేకా రచయామాసయావకం । హరిద్రయాసహస్త్రీ
జ్ఞాశంసంతిశుభసంతతిం ॥ చందనాగరుకర్పూర కస్తూరీపరికల్పితం । విలే
పనం చకారైకా తద్గాత్రేషు సుగంధిషు ॥ మంగళార్థముపానీయ దూ
ర్వాంకూరాన్ సహర్షతః । కర్ణయోస్సృజయామాస నీలోత్పలదళైస్స
హ ॥ ఏవమన్యాశ్చ తాస్తన్వ్యః ప్రకల్ప్య శుభలక్షణాః । వివిధాన్మంగ
ళాచారాన్ క్షణంతత్రానతిష్ఠిరే ॥ అథతాం దర్పణేశుభ్రే పశ్యంతీ మాభి
రూపతాం । వృద్ధాస్తపస్వినాం పత్న్యో గృహీత్వా శోభనాక్షతాః ॥
పతిర్త్వం నిత్యకళ్యాణి భర్త్రాయుక్తా సువర్చసా । ప్రసూష్వ శూరచారి
త్రాన్ పుత్రానష్టౌయశస్వినీ ॥ ఇతిదత్వాశిషస్సర్వాః ప్రాయాక్షుశ్శో
భనాక్షతాన్ । అథోముహూర్తసమయస్సమాసీదచ్ఛుభోదయః ॥ తదా
మహర్షివచనాత్తామానీయశుభాన్వితాం । వేదికాం ప్రాపయామాసుర్య
త్రవైవాహ్యవర్తనం ॥ మార్తికోఽపి సమానిన్యే ముకిభిర్వేదివాన్తికం । వ
సిష్ఠాముఖిభిర్యుక్తః కళ్యాణవిధిపూర్వకం ॥ పుణ్యాహాదీని కర్మాణి కార
యిత్వాతతఃపరం । నవగ్రహాంశ్చ సంపూజ్య లోకపాలాంస్తథాష్టచ ॥
వైవాహికాగ్నిం సంస్థాప్య హుత్వామాంగళికాహుతీః । సర్వం వేదోక్త
మార్గేణవర్తయామాస సర్వశః ॥ అథమానిస్తు దుర్వాసాస్స్వయం విధివి
దగ్రణీః । వేదికామండపేతత్ర చతుస్తంభాభిశోభితే ॥ ఆసీనం ప్రాహము
నీశం స్వస్తిశబ్దపురస్సరం । కన్యేయం మమకళ్యాణీ ముక్తికాంతామనో

భవా ॥ తవానుచరితా తన్వీ పాణిం గృహ్ణాతు శోభనా । సాక్షీ గుణవతీ
చైవ త్వయి భక్తిమతీ స్వతః ॥ పత్న్యా త్వమేధి ముక్తేశ స్వస్త్యస్తు తవసర్వ
దా । ఇతి వాక్యైర్వ్యక్తం తన్యాం దుర్వాసాః ప్రత్యపాదయత్ ॥ మునివా
క్యానుసారేణ వశిష్ఠానుమతే స్థితః । ముక్తికాంతాకరం ధీరః పరిపస్పర్శ గా
త్రకః ॥ తస్మిన్ కాలే మహానాసీత్తత్ర దివ్యో మహోత్సవః । స్వస్తివాచ
వితానాంచ వేదఘోష స్తపస్వినాం ॥ మాంగళ్యగీతనినదో నానాదమానస్థి
తానాం । దివ్యాప్సరస్సమూహానాం నృత్యగీతవర్తననిస్వనః ॥ దివ్యదుందుభి
ఘోషశ్చ కళ్యాణాగమసూచకః । సాధుస్వస్తిప్రవాదశ్చ తపోవృద్ధద్విజన్మ
నాం ॥ శ్రోత్రేణశ్చ సర్వానపూరయదనేకశః । తత్రాగత్య మహాల
క్ష్మీర్ముక్తామణ్యతతాంచితం ॥ పాత్రం స్వర్ణమయం యుక్త్వా రత్నదీపాంచి
తం శుభం ॥ స్థితా తామనున్యత్యాన్యా దేవకన్యా వ్యవస్థితాః ॥ హే
మాద్రితనయాం గౌరీమనుపృత్య గుణోజ్జ్వలాం । సందధుర్దివ్యపాత్రాణి స్త్రీ
యస్స్వవాణీముఖాః ॥ సర్వా మంగళగీతాని గాయన్త్యస్మముదాన్వితాః ॥
వసిష్ఠోపి మహాతేజా విధిమంత్రపురస్సరం ॥ సర్వం నిర్వర్తయామాస వివా
హక్రమముత్తమం । అథ తౌ దంపతీ యుక్తౌ వశిష్ఠవచనాదుభౌ ॥ అక్షతారో
పణమహాంచక్రాథ తాతౌ పరస్పరం । పురా వరేణ కన్యాయా అక్షతా మూర్ధ్ని
విక్షితాః ॥ ముక్తాస్తయా వరస్యైవం ముదా శిరసి విక్షితాః । అన్యోన్యం చత
దాక్షిప్రం విక్షిప్తాశ్శిరసోస్తయోః ॥ ప్రధానహోమముకరోద్వసిష్ఠో బ్రహ్మ
ణస్సుతః । లాజహోమమథాగ్రేహ స ప్రపద్యానంతరం ॥ అన్యాంశ్చ మం
గళాచారాం స్తత్ర చక్రే యథావిధి । అథ ప్రవేశ హోమంచ తస్మింస్తు శుభ
మండపే అథాగ్నిదారపుత్రాద్యా వేదవేదాంగకోవిదాః । తతో ధర్మాభిసం
పన్నా బ్రహ్మణ్యాః సత్తపస్వినః ॥ ఆశీర్భిరేధయామాసుర్వేదోక్తాభిస్తదం
పతీ । చతుర్థ్యాం తు తిథౌ పశ్చాద్యామే చాష్టమికే తథా ॥ శేష హోమ
మశేషేణ కారయిత్వా యథావిధి । పంచమే తు దినే ధర్మ్యా సాయంకాలే
శుభావహం ॥ కారయిత్వా నాగబలిం దేవార్థం బ్రహ్మణస్సుతః । మండపే

రత్నఖచితే ప్రతిపానే సుబహూన్ శుభాన్॥ విన్యాసయిత్వా తత్పూజాం కారయామాస దంపతీ। పంచస్వే తేషు దివసేష్వనేక విషయాగతాః బ్రాహ్మణా స్తరుణా వృద్ధా వేదవిద్యా విశారదాః॥ భుక్త్వా సంతృప్తాః పూజితాశ్చ విశేషతః॥ భూషణానిచ వస్త్రాణి వాహనాని విశేషతః। లబ్ధ్వా నాశ్చ మహోద్గోష్ఠీ రవాపుః పరమాం ముదం॥ ఇతిసకలశుభాఢ్యం సాధు కల్యాణ మేతద్గిరిశభుజభవస్య శ్రీమతో మౌక్తికస్య। పఠతి వదతి వా యః శ్రద్ధయా వా శృణోతి వ్రజతి సకలసంపత్సంతతిం నో చిరేణ॥

ఇతి శ్రీ బ్రహ్మాండపురాణే బ్రహ్మనారదసంవాదే వర్ణవైభవ

ప్రస్తావే మౌక్తికోపాఖ్యానే ముక్తేశకళ్యాణం

నామ పంచదశోఽధ్యాయః శ్రీ శ్రీ





శ్రీరస్తు.

కళ్యాణంభూయాత్.

---

శ్రీ బ్రహ్మాండపురాణే వర్ణవైభవ
ఖండే ముక్తర్ష్యుపాఖ్యానే
షోడశోధ్యాయః.

నారదఉవాచ॥ అనంతరం కింకృతవాన్ ముక్తదేవో మహాశయః। తస్య ధర్మప్రచారస్య సర్వంమేవినివేదయ॥

* బ్రహ్మోవాచ *

అనంతరం మహాదేవో ముక్తదేవోమహామతిః। స్వమందిరేవసంతం తమీశ్వరం పార్వతీపతిం॥ తథావిష్ణుం రమానాథం సంపూజ్యవిధినా తథా। లోకేశప్రముఖాన్ దేవాన్ వసిష్ఠాదీన్మునీంస్తథా॥ పూజయిత్వా స్వర్ణవస్త్రభూషణాని దథౌతతః। అనంతరే శుభదినే సుముహూర్తే శుభాన్వితే॥ సర్వాభిస్త్రీకళస్త్రీభిస్తైస్సర్వైశ్చ సుపర్వభిః। మునిభిర్బ్రాహ్మణైశ్చైవ సమేతౌదంపతీఉభౌ॥ వైభవేనైవమహతా వసిష్ఠానుమతేస్థితౌ నిమిషాపూజనంచైవ యథావిధివితేనతుః॥ తత్రాగతానాం విప్రాణాం గోహిరణ్యాదికంబహు। దత్వాసంతోషయామాస ముక్తేశోభక్తితత్పరః ఆశీర్భిరేధయామాసు ర్మునయోస్తంవిచక్షణాః। ఆషోడశదినంసర్వేతత్రోషుః పరమర్షయః॥ దేవాశ్చ సహగంధర్వా వితోత్సవదిదృక్షయా। అథసర్వేబహుమతా జగ్ముస్తేస్వంస్వమాలయం॥ అథముక్తమునిశ్రీమాన్ సంపూజ్య గిరిజాపతిం। పప్రచ్ఛప్రశ్రయోపేతైవ ధర్మం ధర్మార్థతత్పరః॥

భగవన్ పార్వతీనాథ సర్వలోకమహేశ్వర। బ్రూహిధర్మాన శేషేణ సమవంశస్యముఖ్యతః॥ ప్రాహతం పరిపృచ్ఛన్తం పార్వతీవల్లభోహరః।

*** శివ ఉవాచ ***

వత్సవక్ష్యామి తేసర్వాన్ కులధర్మాన్ సనాతనాన్॥ సర్వేషాంచ మనుష్యాణాం సత్యంధర్మస్సనాతనః। తతఃపరమహింసాచ పరమోధర్మ ఇష్యతే॥ ఆస్తేయమధికోధర్మశ్శమోథ దమఏవచ। శ్రుతంధర్మః పరంపుత్రదానంధర్మస్తతఃపరం॥ యజ్ఞాస్తతఃపరంధర్మస్తపోధర్మస్తతఃపరం। ఇజ్యాధ్యయనదానానిధర్మాస్తత్రద్విజన్మనాం॥ అహింసాసత్యమస్తేయంశాంతిర్ధాంతిస్తపస్తథా। సర్వేషామపివర్ణానాం సద్ధర్మాః కారణానివై॥ సర్వశ్చధర్మవర్గోయం నియతంవేదమూలకః। వేదార్థానాంప్రవచనే యాంచనేచప్రతిగ్రహే॥ వర్ణానాం బ్రాహ్మణోదక్షస్సోధికారీచ తత్రహి। బ్రాహ్మణాన్ప్రణిపత్యార్యాన్ పరిప్రశ్నేనసేవయా॥ సంలబ్ధవ్యోత్రధర్మార్థో వర్ణైరన్యైర్విశేషతః। తస్మాత్సర్వత్రలోకేస్మిన్ వర్ణానాం బ్రాహ్మణోగురుః॥ తపశ్ఛిద్రం జపశ్ఛిద్రం యచ్ఛిద్రం యజ్ఞకర్మణి। సర్వంభవతినిశ్ఛిద్రం బ్రాహ్మణైః ప్రతిపాదితం॥ గుణత్రయవిభాగేన సృష్టావర్ణాస్స్వయంభువా। తత్ర సత్వోత్తరోవిప్రః క్షత్రియోరజసాధికః॥ వైశ్యశ్శూద్రస్త్రియశ్చైవ భూయసాతమసాధికాః। క్షత్రియాణాంచ వైశ్యానాం శూద్రాణాంచైవయోషితాం॥ విప్రానువర్తనం న్యాయ్యం ధర్మలాభమభీప్సతాం। తస్మాత్త్వామత్రముక్తేశ త్వద్వంశ్యానాంతతఃపరం॥ సర్వేషాంపరమోధర్మో బ్రాహ్మణ్యప్రతిపాలనం। సమాసతస్తేవక్ష్యామి మేధావీత్వం గ్రహీష్యసి॥ ఇమేవర్ణస్య తేవత్స కులధర్మాః ప్రకీర్తితాః। బ్రాహ్మణస్య మతేస్థిత్వా కర్తవ్యావైదికీక్రియా॥ యజనం దేవతానాంచ తథాధ్యయనమేవచ। యథాశక్తిప్రధానంచ బ్రాహ్మణేభ్యోవిశేషతః॥ త్రయమేతన్నసంత్యాజ్య మేషధర్మస్సనాతనః। ప్రజానాం పాలనం నిత్యమాయాధగ్రహణంతథా॥ క్షత్రియాణాం సువిహితం బ్రహ్మణాసార్వకాలికం। అ

నాపత్కాలికో ధర్మో యన్నృణాం దండధారణం॥ ఆపత్కాలేపి సంప్రాప్తే నత్యాజ్యం కర్మవైదికం। ఆపత్కాలేతు సంప్రాప్తే హ్యనాయుధపరిగ్రహే॥ చిత్రాణి రాజచిత్రాణి రచయిత్వా ప్రయత్నతః। అనుసృత్య మహీపాలాన్ వృత్తిః కర్తుమభీప్యతే॥ దేవాయతనముఖ్యేషు త్వత్కులీనైర్వినిర్మితాః। విగ్రహాః ప్రతిపూజ్యంతే విష్ణ్వాదీనాం విశేషతః॥ శిల్పకర్మాణి సర్వాణి రచయిత్వా విధిక్రమాత్। సంతోష్య ధరణీపాలాన్ మహీయన్తే భవజ్జనాః॥ అనాపది క్షత్రియాణాం జీవనం దండధారణం, ఆపత్కాలేతు సంప్రాప్తే వృత్తిశ్చిత్రం భవత్కులే॥ నచతత్కర్తుమర్హంతి ధరిత్ర్యాముపరేజనాః। నచాన్యాం వృత్తిమీప్సేత భవద్వంశభవో జనః॥ దేవాయతననిర్మాణం రాజమందిరనిర్మితిః। యంత్రాది సంప్రతిష్ఠానం శిల్పశాస్త్రానుసారతః॥ సర్వం యదన్యచ్చిత్రాంగం సాధికుర్యుర్భవజ్జనాః। సత్రినానావిమానాని సర్వతోభద్రమాదితః॥ తత్రసర్వత్ర నైపుణ్యం త్వజ్జనానాం భవిష్యతి। చిత్రం నామాత్ర ముక్తీశ విద్యాసాధారణీ భువి॥ యస్మిన్ విశ్వమిదం కృత్స్నమంతర్భూతమరిందమ। నసా విద్యా నసచ్ఛాస్త్రం నతద్వస్తు నసాకలా॥ నసభావోస్మి లోకేస్మిన్ చిత్రే యత్తు నదృశ్యతే, నజీవికైవముక్తీశ కులవిద్యాపి తేనఘ॥ తం తుధర్మం ప్రవక్ష్యామి స్వధర్మం త్వత్కులస్యచ, విహాతవ్యం నమానీంద్ర చిత్రకర్మభవత్కులే॥ ప్రతిపాలయ భద్రం తే కులధర్మం సనాతనం, కృతే భవత్కులీనాస్తు ప్రభవిష్యంతి పార్థివాః॥ త్రేతాయాం ద్వాపరే చైవ కతిచిద్విషయాధిపాః, అత్రైవైశ్వర్యా భవిష్యంతి కాలక్రమవశంగతాః॥ కలౌయుగే భవద్వంశ్యాః కళ్యాణాచారచారిణః। సదాచారైకనిరతా బ్రహ్మశుశ్రూషణేరతాః॥ చిత్రవిద్యాసు కుశలా భూమిపాలప్రియంకరాః। భవిష్యంతి నసందేహో మమైవ వచనం యథా॥ భవిష్యతి తదాధాత్రీ మ్లేచ్ఛాక్రాంతాచ సర్వశః। తత్రవృత్తిం కరిష్యంతి చిత్రైస్తద్వంశసంభవాః॥ శిల్పైర్నానావిధైశ్చైవ తత్ర దోషోనవిద్యతే। చిత్రం భవత్కులే ధర్మం మయా సంకల్పితః పురా॥ యేన

